# భారత జాతి వైతాళికుడు

## (డా॥ అంబేడ్కర్)

(M.A; Ph.D; D.Sc; LL.D; D. Litt; J.P; Bar-at-law.)

**14-4-1891 — 6-12-1956**

## బుఱ్ఱకథ

రచన :

శ్రీ లంకపల్లి జాకబ్ H.M.

కూర్మాపురం, పామర్రు-521 157.



వెల : రు. 2-00

# అంకితం

ప్రజాకవి

## శ్రీ రావూరి ఏకాంబరంగారికి



# ప్రార్ధన గేయం

జోహారు జోహారు భీమరాయ
నేతా భారత నేతా
పీడిత జన త్రాతా
గురు కుల పూజితా
మము గాచిన మమతా ॥నేతా॥

రాగ రంజిత దాతా
పుణ్య చరితా గతా
అనన్య మేదా తతా
కరుణా గత పితా ॥నేతా॥

కలమే ఖలంగా గళ
రాజ రాగ రమణుల
రతనాల ఉద్దండ రాశి
మహర్ మణి దీప భీమరాయ
జై! జై భీమ్!!

రచన:

రచయిత

# ప్రవేశిక

డాక్టర్ అంబేద్కర్ యుగపురుషుడు. సంఘ సంస్కర్త. నవ రాజ్యాంగ నిర్మాత. బహుముఖ ప్రజ్ఞాధురీణుడు. శతాధిక గ్రంథకర్త. దళిత జనోద్ధారకుడు. హేతువాది. భారతదేశమునందలి సంఘ సంస్కర్త లలో నగ్రశ్రేణికి చెందిన మహామనిషి. కులములు, వర్గములు, మతములు వలదని అంబేడ్కర్ నిశ్చితాభిప్రాయము. దీని కొఱకై తన యావజ్జీవి తమును ధారవోసిన త్యాగపురుషుడు. గాంధి, నెహ్రూ, పటేలిత్యాది మహా నాయకులను సిద్ధాంత విషయములందు తిరస్కరించిన రాజకీయ దురంధ రుడు. ఋజువర్తనుడు.

ఆయన జీవితమును శ్రీ లంకపల్లి జాకబ్‌గారు బుఱ్ఱకథగా రచ యించుట మిక్కిలి సముచితము. ఇందలి భాష సరళమై, మధురమై యున్నది. భావములు భావ విప్లవమును రేకెత్తించు నవచైతన్యము కల్గి వది. అంబేడ్కర్ జీవితమునందలి ఘట్టములు, ముఖ్యముగా, అమెరికా ప్రయాణము - హోంరూల్ ఉద్యమము - పూనా - యొడంబడిక - మొద లైన విషయములను రచయిత చక్కగ వర్ణించారు. దళిత జనుల కష్టము లను వ్యవసాయ కూలీల బాధలను నిర్మొగమాటముతో ధైర్యముగ తన గ్రంథమున తెలిపినారు. శ్రామిక లోక కళ్యాణమునకు, దళిత జనోద్ధ రణకు వీరింకను పెక్కు కావ్యములను రచించి ఆంధ్ర బాషకు సేవ చేయ గలరని యాశింతును.

కవిరాజ సాహిత్య విహార్, గుడివాడ
12-4-74

ఇట్లు,
డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావు
యం. బి. బి. యస్.

డా॥ అంబేడ్కర్ జీవిత కథను బుఱ్ఱకథగా రచించి కృతకృత్యు లయ్యారు శ్రీ లంకపల్లి జాకబ్. అసమానతలు, అన్యాయాలను వ్యతిరే కించి, పోరాడిన వీరులకోవకు చెందినవారు అంబేడ్కరు. అంచెలవారీగా ఉన్న హిందూ వర్ణ వ్యవస్థమీద దాడి చేసారు. మహర్ జాతిలో జన్మించ డం వలన స్వయంగా అస్పృశ్యతను, అవమానాలను అనుభవించారు. దాహం ఆడగడం, బండివాడు, మంగలి కూడా దూరంగా పెట్టడం, బడిలో విద్యార్థిగా కూడా అస్పృశ్యతను అనుభవించడం మొదలైన సంఘటనలను రచయిత ఆవేశపూరితంగా చిత్రించారు.

అంబేడ్కర్ అమెరికాలో విద్య నభ్యసించడం వలన సాంఘిక సమానత్వం సాధించాలనే ఆకాంక్ష ఇనుమడించింది. కర్మ సిద్ధాంతం మనిషిని బానిసగా చేస్తుందని ఉద్ఘాటించారు.

అట్టడుగునపుట్టి అత్యున్నతస్థానాన్ని అలంకరించారు అంబేడ్కర్. విశ్వవిద్యాలయాచార్యులుగా, అమాత్య శేఖరునిగా, స్వతంత్ర భారత రాజ్యాంగ నిర్మాతగా తన ప్రతిభను నిరూపించుకొని, దేశ సేవ చేసారు. ఈనాడు అంబేడ్కర్‌ని అనుసరించడం అంటే భారత రాజ్యాంగంలోని లక్ష్యాలకోసం పోరాడడం. భారతదేశంలో సాంఘిక ఆర్థిక సమానత్వాలు సాధింపబడేవరకు అంబేడ్కరు పని పూర్తికాదు. మహర్ బాల్యావస్థలో పడిన బాధల నుండి బౌద్ధమతం స్వీకరించేవరకు, అంబేడ్కర్ జీవిత విశే షాలను, లక్ష్యాలను హృదయానికి హత్తుకునేలాగున వివరించారు రచయిత.

గోపరాజు సాంబశివరావు యం.ఏ.

11-8-1974 ఏ.యన్.ఆర్. కాలేజి, గుడివాడ.

# జననం - బాల్యం

వినుడి వినుడి అంబేద్కర్ చరితమును ॥తం॥
మహారాష్ట్రం కొంకణ ప్రాంతమున ॥తం॥
రత్నగిరి జిల్లా అంబవాడను గ్రామాన ॥తం॥
భీమాబాయి, సక్పాలు దంపతులకు ॥తం॥
1891వ సం. ఏప్రిల్ 14న పుట్టినాడురా ॥తం॥
వీరు మహర్ కులానికి చెందినవారా ॥తం॥
ఈయన 14వ సంతానం అయ్యారూ ॥తం॥

హాస్యం : ఏమన్నావ్ ! అప్పుడు కుటుంబ నియంత్రణ లేదేమిరా ?

వంత : లేదు, లేదు....

ప్రాథమిక చదువును పూర్తి జేసినారా ॥తం॥
ఉన్నత విద్యలో కడుగు పెట్టినారా ॥తం॥
తొలి రోజులలో భీమారావ్‌నకు ॥తం॥
తెలిసిన జ్ఞానం అంటరానితనమూ ॥తం॥
తానొక అస్పృశ్యుడనని సంఘంలో ॥తం॥
తనకున్న హక్కులు చాలాతక్కువని ॥తం॥
చిన్ననాటనె గుండె కెక్కెనురా ॥తం॥

వ. ఒకనాడు భీమారావ్ తన అన్నగారితో కలసి దూరగ్రామంనకు వెళ్ళు చుండగా దారిలో భీమారావ్‌కు బాగా దాహం వేసింది. అల్లంత దూరంలో వారికొక యిల్లు కనిపించింది. ఆశతో వారు ఆ యింటికివెళ్ళి మంచినీటిని అడిగిరి. ఏ కులమువారని గృహస్థు లడిగిరి. మనవారు మహర్ కులస్థులమనిరి.

వంత : అప్పుడా యింటివారు ఏమన్నార్ర మామా.

కన్నులు ఎర్రగ జేసిరీ
తన్నేదమంటూ పల్కిరీ
అంటరాని వారంటునూ
ఆ, గుంటలో నీరు త్రాగమన్నారా ॥బళా॥
పై పై పై

వ. అంతట దాహం బాధతో బాలలు ప్రయాణం సాగించారు. దారిలో ఒక బండివాడితో ఎక్కడానికి బేరమాడారు. ఆ బండిలో కొంతదూరం ప్రయాణం సాగించారు. కాని కొంతదూరం వెళ్ళిన తరువాత మన వారిని బండివాడు మీ కులమేమని అడిగాడు.

వంత : అప్పుడు వారేమన్నారయ్యా ?
మహర్ కులస్థులం అన్నారు.

కన్నులు ఎర్రగ చేశాడూ ॥బళి॥
బండి నుండి పడత్రోశాడూ ॥బళి॥
బాలలు బయటకు పడ్డారు ॥బళి॥
బోరు బోరుమని ఏడ్చారు ॥బళి॥

వ. పైన అస్పృశ్యులు అనగా అంటరానివారని చెప్పినావు కదా వారు ఎలా అంటరానివారో ఆ కాలంన చెప్పెదను వినుము.

చదువులను చదువరాదూ ॥విన. ఓ నిమ్న జా.॥
వీధిలోనా నడువరాదూ ॥ ,, ॥
ఊరుకివెలుపలె మురికిపేటలోనె ॥ ,, ॥
తప్పకుండా వుండి తీరాలా ॥ ,, ॥
నేలపై ఉమియరాదూ ॥బళి॥
ఉమ్మివేయకుండా వారు ॥బళి॥
మూతి కొక ముంతను ॥బళి॥
వెనుకొక తాటాకును ॥బళి॥
చాందస్సులు విధించారా ॥బళా॥

వంత :- ఈ పద్ధతిని ప్రవేశ పెట్టిన దెవర్రా

వ. మనువు అను నాతడు ఈతడు నరరూప రాక్షసుడు. మనిషిని మని షిగా చూడలేని చాందసుడు, మూర్ఖుడు.

వంత :- మరి యింకేమన్నారయా ?

వ. ఆవిధంగా నడచి వెళ్తుండగా అగ్రవర్ణస్థు లెవరైనా ఎదురు వస్తే యితడు వెంటనే ఏ గోడచాటునో గుట్ట చాటునో దాగాలి.

మంచి బట్టలు కట్టగరాదు ॥ఓ నిమ్న॥
పాలు, నెయ్యి తినగరాదు ॥ఓ నిమ్న॥
మగవారికి మూరెడు గోచీ ॥ఓ నిమ్న॥
ఆడ వారికి బారెడు బట్ట మాత్రం ॥ఓ నిమ్న॥
వెండి బంగరు నగలు వేయరాదు ॥ఓ నిమ్న॥
కొట్టినా తిట్టిన దానికి అప్పీలేలేదు ॥ఓ నిమ్న॥

వ. ఈ విధంగా కనివిని ఎరుగని - ప్రపంచంలో మరెక్కడా లేని నిర్బంధ బానిస విధానం వీరిపై విధించబడింది. 2500 ఏళ్ళ తరువాత ఏమ యింద్రా మామా !

కొంతమంది సంఘ సంస్కర్తలు ॥నం॥
వివేకంతో అభ్యుదయ భావాలతో ॥నం॥
దారుణమైన వీరి జీవితాలను చూచి ॥నం॥
గుండెలు విరిగి వైదిక ధర్మంపై తిరుగపడ్డారు ॥నం॥

వంత :- కాని ఫలితం వుందా ? లేదు.

దక్షిణాదిన రామానుజుడురా ॥బళి॥
కర్ణాటకమందు వీరబసవడురా ॥బళి॥
ఆంధ్రలో బ్రహ్మానాయుడురా ॥బళి॥
మహారాష్ట్రంలో తుకారాంరా ॥బళి॥

ఏకనాధుడు, రాజా రామమోహన్‌రాయ్, కబీరు, చైతన్యుడు, చక్రధరుడు, రోహిదాసు, చోకమేళుడు, యీ కాలంన గోపరాజు, రాంజీగారలు పూజనీయులు. వీరి ఆశయాలను, ప్రయత్నాలను వైదిక ధర్మం సాగనివ్వలేదు.

వంత :- తరువాత యింకా ఏం జరిగిందయాంటె -

అంగ్లేయ క్రైస్తవ మిషనరీలు వచ్చారు ॥తం॥
వీరలకు క్రైస్తవ మతం యిచ్చారు ॥తం॥
విద్యా, నాగరికతలు నేర్పారు ॥తం॥
గురువులుగా పెద్ద వుద్యోగాలిచ్చారు ॥తం॥
ఆర్థిక, నైతిక చైతన్యాన్ని కలిగించారు ॥తం॥
నిమ్నజాతీయులకు నూతనత్వం పెంచారు ॥తం॥

వ. ఒకనాడు మన భీమారావ్ మంగలిదగ్గరకువెళ్ళి తనకు క్రాపు చేయమన్నాడు. కాని ఆ మంగలి ఏమన్నాడయా

నీకులమేమని అడిగాడా ॥తం॥
"మహర్" అన్నారు ॥తం॥
మహర్ కులస్థుడవై యుండి ॥తం॥
క్రాపు చేయమంటావా ॥తం॥
అని మంగలి కసరికొట్టాడా ॥తం॥

కాని, అదే మంగలి ఒకనాడు బాగా బొచ్చు పెరిగిన గేదె దూడకు బొచ్చు కత్తిరించుట చూచి, బాధపడి హిందూ సమాజంపై అసహ్యం కలిగింది.

వంత:- ఇంకేం జరిగిందిరా మామా....

బడిపిల్లలంత బల్లలపై వుంటె ॥నం॥
ఈయనేమొ బడికి బయట ॥నం॥

కటిక నేలపై చదువవలసి వచ్చె ||నం||
చదువులోన చురుకు ||నం||
అమితమైన తెలివికి ||నం||
పంతులుగారి కీయనంబె ప్రేమ ||నం||

వ. ఆ ప్రేమతోనే భీమారావ్ యింటిపేరైన అంబవాడ్కర్‌ను తన ఇంటి పేరైన అంబేడ్కర్‌గా సవరించినారు. ఒకనాడు పంతులుగారు పిల్లల కొక లెక్క యిచ్చారు. దానిని బోర్డుపై వేయమన్నారు.

వంత:- అప్పుడేమైయిందిరా భాయ్ !

వ. తరగతిలోని పిల్లల్ని ఒక్కొక్కర్ని అడిగారు. ముందున్న వారంతా చెప్పలేకపోయిరి. అప్పుడు మన భీమారావ్ లేచి ఆ బోర్డు దగ్గరకు వెళ్ళుచుండగా మా భోజనాలు ఆ బోర్డు వెనుక వున్నవి. మైలపడిపో వునని అడ్డగించిరి. అంతట పంతులుగారును, మన భీమారావ్‌ను చేయు నది లేక వూరకుండిరి. ఈ సంఘటన మన భీమారావ్‌కు ఆక్రోశం, ఆవేదన కలిగించినది.

తన చిన్న నాటనే తల్లి కన్నుమూసెను ||తం||
తండ్రి రెండవ పెండ్లి చేసికొన్నాడా ||తం||
తల్లి స్థానాన్ని వేరొక స్త్రీ ఆక్రమించడం ||తం||
భీమారావ్ సహించలేక పోయాడా ||తం||
దీనితో అతనికి చదువుపై విరక్తి కలిగింది ||తం||
ఇంటినుండి పారిపోవాలని తలంచినాడా ||తం||

వ. చార్జీ డబ్బులు కోసం కొన్నిరోజులు సతారా రైల్వేస్టేషన్‌లో కూలికి మూటలు మోయుచున్న సమయాన తన మేనత్తగారు చూచి మందలిం చింది.

ఇంటికి రమ్మని తీసుకు వెళ్ళిందా ||బళి||

ఆమెకు ఈయనపై అమితమైన ప్రేమ ।బళి।
వృద్ధిలోనికి రావలసిన బాలుడన్నది ।బళి।
చెడిపోవుట నాకిష్టం లేదన్నది. ।బళి।

హాస్యం :— మరెవ్వరికైన వుంటుందా ? వుండదు.

వ. బొంబాయి నూలు మిల్లులో చిన్నపిల్లలను కూడ కూలికి పెట్టుకుంటారని భీమారావ్‌కు తెలిసింది. ఎలాగైనా బొంబాయి పారిపోవాలని ఆశతో ఒకనాటిరాత్రి మెల్లగా వెళ్ళి తన మేనత్త కొంగునవున్న వక్కల సంచీ దొంగిలించాడు. ఆసంచిలోనె డబ్బులుకూడ వుంటాయని తెలుసు.

హా;— కాని, ఏమున్నాయిరా మామా దానిలో—

వంత:- చివరకు చిల్లర డబ్బులేరా అల్లుడు దానిలో

కావున ఆశ నిరాశగ మారిందా ।తం।
యిదేరా టర్నింగు పాయింటూ ॥తం॥
పారిపోవాలని కోరిక పోయిందా 'తం'
చదువుపై మంచి శ్రద్ధ కలిగిందా ॥తం॥

వ. తల్లిదండ్రుల వద్దనుండి దూరంగా వెళ్ళి ఏగుమస్తా వుద్యోగం చేసికొంటూ బ్రతకవచ్చుననే వుద్దేశ్యంతో చదువుపై దృష్టి కేంద్రీకరించాడు. ఈ నిర్ణయమే భారతదేశ చరిత్ర పుటలలో నూతన సృష్టి జరిగింది. ముక్కు కాస్త వంకరగా వుండివుంటె ప్రపంచ చరిత్ర మరో విధంగా వుండి వుండేదని చరిత్రకారుడు క్లియోపాత్రా చమత్కరించారు

చదువుపై దృష్టిని కేంద్రీకరించాడా ।మన భీమా॥
మంచిమార్కులు తెచ్చుకోసాగాడా ॥ ,, ॥
ఈతిబాధల నన్నిట నోర్చినాడా ॥ ,, ॥
ఆర్ధికమాంద్యం ననుభవించినాడా ॥ ,, ॥
మానసిక అవమానాలకు తలఒగ్గినాడా ॥ ,, ॥

వ. ఇన్నీ అనుభవిస్తూ ప్రత్యేక పాఠ్యభాగంగా సంస్కృతంను కోరారు మన డాక్టరు.

హా :- పంతుళ్ళు అందు కంగీకరించార్రా మరి.... లేదు.
ఎందుకయ్యా అంటే - కులతత్వం వార్ని అంటింది. ఏ భాష యిచ్చార్రా మరి - పర్షియన్ భాష.

వ. కాని, మన డాక్టరు పట్టుదలతో సంస్కృతాన్ని స్వయంగా కృషి చేసి నేర్చుకొని ఆపై వేదవేదాంగాల్నన్నింటిని తిరగ వేసి జీర్ణించు కొని వాటిలోని గుట్టుమట్టును చేయగలిగాడు. 1907వ సం. మెట్రి క్యులేషను మంచి మార్కులతో పాసయ్యారు. ఆ కాలంలో అంటరాని వాడు మెట్రిక్ పాస్‌కావటం గొప్పవిశేషం. అందుకు తండ్రికి అమిత మైన ఆనందం కలిగింది. అప్పుడు భీమారావ్‌ని బొంబాయి పట్టణం లోని మహర్ కులస్థులంతయు సన్మానించాలని నిర్ణయించారు. ఆసభకు సంఘసంస్కర్తయైన కేలూస్కర్‌ను ప్రెసిడెంటుగా ఎన్నుకొన్నారు.

వీరి అధ్యక్షతన ఘనంగా సన్మానించారా ॥తం॥
కేలూస్కర్ చదువులకు తోడ్పడతానన్నారా ॥తం॥
పై చదువులకు ముందు పెండ్లి చేసినారా ॥తం॥
భీమారావ్ వయస్సు 17 సం.లా ॥తం॥
రామాబాయి వయస్సు 9 సం.లా ॥తం॥

వ. వివాహానంతరం బొంబాయి పట్టణంలోని ఎలిఫిన్‌స్టన్ కళాశాలలో 1912వ సం.న ఫస్టుక్లాసులో బి. ఎ. పాసైరి. ఇంటిదగ్గర తండ్రి పరి స్థితి ఎలాగున్నదనగా - రోజుగడవడం కష్టంగా వున్నది. ఇలాంటి ఆపత్సమయంలో కేలూస్కర్ పండితుడు ఆదుకొన్నారు.

వంత :- ఏ రూపంగా నాయనా -

# ఉపకారవేతనం

బరోడా మహారాజైన శాయాజీరావ్ గైక్వార్ ఒక బహిరంగ సభలో ప్రసంగిస్తూ పేదకులాలకు చెందిన విద్యార్థులలో తెలివిగలవారికి పై చదువులకు ఆర్థిక సహాయం చేయుదునని మాట యిచ్చిరి. ఈ మాట ప్రకారం కేలూస్కర్ బరోడా మహారాజుగారి యొద్దకు మన భీమారావ్‌ను తీసికొని వెళ్ళి పరిచయం చేసిరి. అంతట ఆయన కుర్రవానిని పరీక్షించి ముగ్ధుడై ఉపకారవేతనం నెలకు రు. 25/-లు యిచ్చుటకు అంగీకరించిరి. బి.ఎ. పాసైనందున ఆయన సంస్థానంలోని రక్షణ శాఖలో వెంటనే ఉద్యోగం యిచ్చిరి.

ఇంతలో తండ్రి వద్దనుండి టెలిగ్రాం వచ్చింది. అనారోగ్యం అని. ఈ వార్త విన్నంతనే యింటికి వెళ్ళాడు. అంతలోనె తండ్రి కన్నుమూశాడు. అదిచూచి క్షణంపాటు స్థంబించి పోయాడు. కొంత సేపటికి తేరుకున్నవాడై బరోడా మహారాజును దర్శించి ఉపకార వేతనం అన్నమాట ప్రకారం పుచ్చుకొని విదేశచదువులకు ప్రయాణం కట్టారు.

# అమెరికా ప్రయాణం - చదువు

అమెరికా ప్రయాణమయినారా ॥మనభీమా॥
కొలంబియా విశ్వవిద్యాలయంలో చేరారా ,,
తొలిసారి స్వాతంత్ర్య, సమానతలను చవిచూచారా ,,
హాస్టల్లో మకాం పెట్టారా ॥మనభీమా॥
అచ్చట కుల మత వివక్షత లేదా ,, కు
అందరితో పాటు ఆదరణ లభించిందా ,, కు

వ. భారత దేశంలోని అస్పృశ్యత తన విద్యార్థి జీవితం ఒక పీడకలగా తోచింది. అమెరికాలో తానొక నూతన ప్రపంచంలో వున్నట్లుగా భావించి తనకు లభించిన యీ మహత్తర స్వేచ్ఛాజీవనం తన కులిస్తులందరికీ ఎప్పుడు దొరుకుతుందా అని కలలుకనేవారు.

అచ్చట నుండి తన మిత్రునకు లేఖ వ్రాస్తూ విప్లవాత్మకమైన భావా లతో తల్లి దండ్రుల పూర్వ జన్మ సుకృతా ననుసరించి తమ సంతానం యొక్క అదృష్ట దురదృష్టాలు ఆధారపడి వుంటాయనుకోవడం కేవలం కల్పితం. నిరాధారమైన యీ కర్మ సిద్ధాంతం కేవలం కొందరు స్వార్థ పరుల కుట్రమాత్రమే. ప్రతి దేశం త్వరితగతిని అభివృద్ధి చెందాలంటె ప్రతివారు తమ బిడ్డలను ఎంతో కొంత అవకాశం వున్నంతవరకు తప్పకచదివించి తీరాలి. అప్పుడు మనజాతిగాని ఏజాతిగాని ఐనా దానం తట అదె అభివృద్ధి చెందుతుందన్నారు మన డాక్టరు.

| | |
|---|---|
| రోజుకు ఒక పూట మాత్రం తినేవారా | ॥మనభీమా॥ |
| సామాన్యమైన బట్టలతోనె కాలేజీకెళ్ళాతా | ,, |
| పుస్తకాలు మాత్రం ఎక్కువగా కొనేవారా | ,, |
| ఉపకార వేతనంలో కొంత మిగిల్చినారా | ,, |
| ప్రతినెలా యింటికి తప్పనిసరిగా పంపేవారా | ,, |
| రోజుకు 18 గంటలు చదివేవారా | ,, |

వ. ఎం. ఏ లో తన కిష్టమైన రాజకీయ, నైతిక, మానవ ఆర్థిక శాస్త్రా లను పాఠ్యభాగాలుగా ఎంచుకొన్నారు. ఇన్ని చదివి అనతి కాలంలోనే "భారత దేశంలోని ప్రాచీన వాణిజ్యం" అనే పరిశీలనాగ్రంథం (Thesis) వ్రాశారు. ఈగ్రంథాన్ని పరిశీలించి 1915 వ సంవత్సరమున కొలం బియా యూనివర్సిటీ వారు ఎం. ఎ. పట్టం యిచ్చారు.

ఆ తరువాత "భారత దేశంలోని కులాలు వాటిపుట్టు పుర్వోత్తరాలు అనె మరొక పరిశీలనా గ్రంధాన్ని వ్రాశారు. ఆ గ్రంధాన్ని 1916 లో జరిగిన మానవ శాస్త్ర పరిశోధకుల సదస్సులో చదివి వినిపించగా సదస్యులందరికి భారతదేశంలో కులాలు ఏవిధంగా పుట్టగొడుగుల్లాగా లేచినది వారికి కనువిప్పు కలిగించారు. "భారతదేశ జాతీయాదాయం దాని చారిత్ర పరిశీలన" అనె మరో గ్రంధాన్ని వ్రాసి డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ (Ph. D.) డిగ్రీని పుచ్చుకొన్నారు.

ఈ ఆర్ధిక గ్రంధం ప్రపంచ దేశాల ఆర్ధిక శాస్త్రవేత్తలందరి మన్ననలను పొందినది. పిన్నవయస్సులోనె యింత గొప్ప గ్రంథమును రచించి నందుకు వీరిని అమెరికాలోని మేధావులంతా ఒక సభలో ఘనంగా గౌరవించిరి. కావునప్పటినుంచి అంబేద్కర్ అటుతరువాత డాక్టరు బి. ఆర్. అంబేద్కర్‌గా ప్రపంచ ఖ్యాతి పొందినారు. ఈ గ్రంధం భారతీయ రాజకీయ శాస్త్రవేత్తల చేతులలో ప్రతి ఒక్కరిదగ్గర వుండెడిది. ఈ గ్రంధాన్ని బరోడా మహారాజుగారికి కృతజ్ఞతగా అంకితం యిచ్చారు. ఎంతో శ్రమించి 2000 పుస్తకాలను అమెరికాలోవున్న సమయాన కొని వుంచుకోగలిగారు.

1916 వ కొలంబియా నుండి లండన్ నగరంనకు వెళ్ళారు. అక్కడ ఈయనను పోలీసులు హార్బరులో సోదా చేశారు.

హో:- ఎందుక్కురా సోదా చేశారంటున్నావ్. ఎందుకనగా !
లాలా లజపతిరాయ్ ఆధ్వర్యాన || బళి ||
భారత స్వాతంత్ర్య పోరాటం జరుగుతుండగా ,,
అందు చేరారనె నెపాన సోదా చేశారా ,,
అప్పుడు మన డాక్టరు అమెరికాలోనె వున్నారా ,,
రాయ్ తనను గదర్ పార్టీలో చేరమన్నారా ,,

అందుకు మన డాక్టరు అంగీకరించ లేదా ॥ బళి ॥
విద్యార్థి దశలో రాజకీయాలలో చేరనన్నారా ,,
బరోడా రాజుకు నాపై ఎన్నో ఆశలున్నాయన్నారా ,,
భార్యా బంధువులకు అన్యాయం చేయలేనన్నారా ,,

వ. కాని, పోలీసుల సోదా ఏమీ రహస్యాలు దొరకనందున వృథామైవారు వెళ్ళిపోయారు. లండన్ నగరంన గ్రౌన్‌యిన్‌లో చేరి న్యాయశాస్త్రాన్ని హెరాల్డుస్కి- స్కూలులో ఆర్థిక, రాజకీయ శాస్త్రాలను ఒకేసారి బారిష్టరు, ఎం. ఎస్. సి. డి. ఎస్. సి చదువమని ఆ కళాశాలవారు అనుమతి యిచ్చారు. కాని....

హా:- కాని, కాని ఏంట్రా....ఏం జరిగింది తేల్చి చెప్పుమరి.

వ. బరోడా మహారాజాకు తెలియకుండానే అచ్చటవున్న బ్రాహ్మణ మంత్రి గారు జరిపిన తతంగంవలన వుపకార వేతనం నీకు కేటాయించింది అయిపోయింది కావున అచ్చటి చదువులు ఆపి యిచటికి రావలసింది అని తాకీదు పంపాడు. అందువలన మన డాక్టరు ప్రయాణం అయి వస్తూవున్నట్లుగా కేబిల్ వచ్చింది. కాని,

హా:- ఎన్ని కానీలురా నన్నాసి చెప్పు త్వరగా మరి....

వ. లండన్ నుండి మన దేశానికి వస్తున్నటువంటి నావ ఒకటి సముద్రంలో మునిగిపోయినట్లుగా యింటికి వార్త వచ్చింది. కానీ, ఆ నావ మాత్రం మన డాక్టరు ప్రయాణం చేయుచున్నది కాదని మరొక వార్తరాగా అందరును ఆనందపడ్డారు. మునిగిపోయిన నావలో మాత్రం అమూల్యమైన పుస్తకాలు పార్శిల్స్ మునకలో పోయినవి. కావున దానికి కంపెనీ వారు తగిన నష్టపరిహారం యిచ్చారు.

బరోడా మహారాజు మన డాక్టరు వస్తున్నాడని విని సంతసించి తోడ్కొనిరమ్మని కొలును స్టేషనుకు వెళ్ళవలసిందిగా ఆజ్ఞాపించారు. కాని, ఎవ్వరూ వెళ్ళలేదు.

హో: ఎందుకనిరా మామా వెళ్ళింది.

కలపిచ్చిరా సన్యాసి, అట్లా తీసికొనిరావటానికి యిదేమైనా అమెరికా దేశమా లేక ఇంగ్లండా - కాదు.

బరోడా స్టేషనులో రైలుదిగారా ॥మనభీమా॥
పెట్టిబేడా చంకను వేశారా ,,
కాలినడకను చేరికొన్నారా ,,
అస్పృశ్యుడను ఉన్నతోద్యోగన్నారా ,,
వస్తున్న వార్త అంతా పాకిందా ,,
రక్షణశాఖలో నియమితులైనారా ,,

వ. ఎంతోమందికి అధికారియైన మన డాక్టరును ఉపకార్యదర్శులు, గుమస్తాలు, నౌకర్లు, చాకర్లు ఎవ్వరూ గౌరవంగా జూడక యీసడింపు దృష్టితో చూడ నారంభించారు. ఆఖరుకు బంట్రోతుకూడ ఫైళ్ళనుదెచ్చి దూరంగావుండి మన డాక్టరు బల్లపై గిరాటు వేసేవాడు.

నౌకర్లు చూపుతున్న నిర్లక్ష్యధోరణికి ॥నం॥
తానెంతో బాధపడుతుండేవాడు ॥నం॥
ఎంత రక్షణశాఖ కార్యదర్శియైన ॥నం॥
తనకు అద్దెకు యిల్లు యివ్వరైరి ॥నం।
ఒక్కపార్సీవారి సత్రంలో మకాం పెట్టారా ॥నం॥
అస్పృశ్యుడని తెలిసి బయటకు పంపాడా ॥నం॥

వ. జరిగిన అవమానానికి బాధపడుచూ పెట్టిబేడా వేసుకుని ఒకచెట్టు క్రింద కూర్చుని భోరుమని ఏడ్చేడు. ఈ విషయం బరోడా రాజాగారికి చెప్పుకున్నాడు. కాని, రాజు తన అసహాయస్థితిని వెలిబుచ్చాడు.

ఇక గత్యంతరంలేక మన డాక్టరు పదవికి రాజీనామాపెట్టి యింటికి బయలుదేరాడు. ఆ సమయాన తన గుండెలో అగ్నిజ్వాలలవలె హిందూ

మతంపైన, హిందువులపైన పట్టరాని ద్వేషం, అసహ్యం ఏర్పడి పగ పట్టిన పాములా వున్నారు.

## హోంరూల్ ఉద్యమం

1917న అనిబిసెంటు నాయకత్వానా ॥తం॥
హోంరూల్ ఉద్యమం ప్రారంభమయిందా ॥తం॥
స్వయం పరిపాలనాధికారం ప్రకటించినారా ॥తం॥
కాంగ్రెస్‌కు, ముస్లింలీగ్‌కు ఒప్పందం కుదిరిందా ॥తం॥
భారత జనాభాలో 10వ వంతువున్న ॥తం॥
నిమ్న జాతుల మాటేమిటి? అని ॥తం॥
వీరిలో తీవ్రమైన సంచలనం కలిగింది ॥తం॥

వ. బొంబాయి రాష్ట్రంలో నారాయణచంద్ర వాడ్కర్ అనె సంఘసంస్కర్త నాయకత్వాన పనిచేస్తున్న డిప్రెస్డ్ క్లాసెస్ మిషన్ సొసైటీ [నిమ్న జాతుల సంక్షేమ సంఘం]వారు చందవాడ్కర్ అధ్యక్షతన ఒక సభను ఏర్పాటు చేశారు. అన్ని సభలలోను మాకు ప్రత్యేక స్థానాలుండాలనీ, ఈ ప్రత్యేక స్థానాలకు మేమె మా అభ్యర్థులను ఎన్నుకోవాలని తీర్మానించారు.

ఈ తీర్మానాన్ని డిప్రెస్ట్‌క్లాసెస్ మిషన్ తరపున ॥తం॥
బ్రిటిష్ ప్రభుత్వమునకు పంపారా ,,
సంఘ పునర్నిర్మాణం అనె గ్రంథానికి ,,
సుదీర్ఘమైన సమీక్షను వ్రాసారా ,,
సిడన్ హామె కాలేజీలో ప్రొఫెసర్‌గా చేరారా ,,

వ. మన డాక్టరు పాఠము చెప్పుచున్నప్పుడు విద్యార్థులు హాలంతా నిండిపోయి ఆసక్తితో వినుచుండెడివారు. "మూక్ నాయిక్" అనే పేరుతో

మరాఠీ పక్షపత్రిక ఏర్పాటు చేశారు. మూక్‌నాయక్ అంటే మూగ వాళ్ళకు నాయకుడని అర్థం. నోరుండి తమకు జరుగుతున్న అన్యాయాలను ఎదిర్చి మాట్లడలేని కోట్లాది నిమ్నజాతుల వారును మూగవారే. ఇది సంఘ చైతన్యాన్ని, మనోవికాసాన్ని కల్గించే పత్రిక. 1920వ సంవత్సరం నాగపూర్‌లో అఖిలభారత నిమ్నజాతి మహాసభ ఏర్పాటయింది. దానిలో మన డాక్టరు ఉపన్యాసం యిస్తూ కులాల పుట్టుపూర్వోత్తరాలతో ప్రారంభించి అస్పృశ్యుల అగచాట్లవరకు అనర్గళంగా వివరించారు.

విన్నవారెల్లరు పులకితులయ్యారా ॥బళా ॥
వీరి దాస్యశృంఖలాలను బ్రద్దలు చేసేందుకు ,,
వీరిలోనే ఒక అపూర్వవ్యక్తి అవతరించారు ,,
కొల్హాపూర్ మహారాజా ప్రశంసించారు ,,

వ. మన డాక్టరుకు యిద్దరు కుమార్లుపుట్టి చిన్నతనములోనే చనిపోయారు. కాని మూడవ కుమారుడైన యశ్వంతరావ్ ఆరోగ్యం కూడ అంత మంచిదికాదు. కావున తల్లి కొడుకును గురించి ఆందోళన పడుతూండేవారు. తండ్రి పత్రికా నిర్వహణలోను, కళాశాల పనులలోను తీరికలేక వుండేవారు.

బరోడా మహారాజు యిచ్చిన వుపకారవేతనాన్ని తాను సంస్థానంలో 10 సంవత్సరాలు పనిచేయలేదు గాన నీవు తిరిగి డబ్బు మొత్తం కట్టాలని మన డాక్టరుకు నోటీసు పంపారు. కాని యీ విషయం మహారాజాకు అసలు తెలియదు. యిది దివాన్లు చేసిన మంత్రాంగం. కోర్టుకు కూడ వెళ్ళాలనుకొనుచుండగా మహారాజాకు తెలిసి దివాన్లను చివాట్లుపెట్టి చిల్లిగవ్వ కూడ యివ్వనక్కరలేదని ఆర్డర్ పాస్‌చేశారు.

ప్రొఫెసర్‌గా పనిచేస్తూ ఎంతో జాగ్రత్తగా డబ్బును దాచి, పార్శీ మిత్రునిదగ్గర 5 వేలు అప్పుచేసి, కొల్హాపూర్ మహారాజా దగ్గర కొంత ఆర్ధిక సహాయం తీసికొని లండన్ బయలుదేరారు.

## లండన్ - చదువు

1920లో లండన్‌లో విద్యార్థిగా చేరారా ॥తం॥
రోజుకు 18 గంటలు చదివేవారా ॥తం॥
బ్రిటిష్ మ్యూజియమ్‌లోని గ్రంధాలన్నీ ॥తం॥
తనివితీరా గ్రంధాలయం మొత్తం చదివారా ॥తం॥

వ. ఈయనకు ముందు కారల్ మార్క్స - కమ్యూనిష్టు సిద్ధాంత రచయిత 2. మజనీ - ఇటలీ రిపబ్లిక్ నిర్మాత చదివారు.

ఉదయాన స్నానాదిక్రియలు పూర్తిజేసేవారా ॥తం॥
2 రొట్టెలు, టీ త్రాగి లైబ్రరీ చేరేవారా ॥తం॥
సాయంకాలం మూసెవరకు వుండెడివారా ॥తం॥
ఎత్తివ్రాసుకొన్న కాగితాలతో ॥తం॥
కోటు జేబులన్నీ నిండుగా నిండివుండేవా ॥తం॥
భోజనానంతరం అర్ధరాత్రివరకు చదివేవారా ॥తం॥
భారతదేశంలోని స్వాతంత్ర్య పోరాటంగూర్చి ॥తం॥
నిమ్నజాతీయుల కార్యకలాపాల గూర్చి ॥తం॥
ఉత్తరాలద్వారా వినుచుండెడివారా ॥తం॥

వ. ఆనాడు బ్రిటిష్ ఇండియా కార్యదర్శి మాంటేగు నిమ్న జాతుల ప్రాతినిధ్యం గూర్చి సుముఖత్వం తెలిపినట్లు విని ఆనందంపొందారు. 1921 సం. "ప్రొవిన్షియల్ డి సెంట్రలైజేషన్ ఆఫ్ ఇంపీరియల్ ఫైనాన్స్

ఇన్ బ్రిటిష్ ఇండియా" [బ్రిటిష్ ఇండియాలో రాష్ట్రీయ ఆర్థిక వికేంద్రీకరణ] అన్న పరిశోధనా గ్రంథాన్ని వ్రాసి యం. యస్. సి. డిగ్రీ మరియు అదేసమయానికి బారిష్టర్ గూడ పూర్తిచేశారు.

1922 సం. "ప్రాబ్లెమ్ఆఫ్ ది రూపీ" [రూపాయి సమస్య] అనె మరో గ్రంధాన్ని వ్రాసి డాక్టరేట్ డిగ్రీ పొందారు. అతి తక్కువ కాలంలో ఒకేసారి ఇన్ని డిగ్రీలు పొందిన మేధావి భారతదేశంలో అప్పటికి యిప్పటికి డా॥ అంబేడ్కరు ఒక్కరే అని చెప్పకతప్పదు.

జర్మనీలోని బాన్ విశ్వవిద్యాలయంనుండి తర్క, ఆర్థిక శాస్త్రాలకు డి. లిట్. పుచ్చుకొన్నారు.

ఇప్పుడు డా॥ బి. ఆర్. అంబేడ్కర్ ఎం. ఏ. పి. హెచ్. డి. [కొలంబియా] డి. ఎస్. సి. [లండన్] డి. లిట్ [జర్మనీ] బారిష్టర్-ఎట్-లా [లండన్].

హా:- ఇంత చదువు చదివి ఎంతున్నాడ్రా మామా -

మాతృదేశం తిరిగి వచ్చాడా ॥నం॥
లాయర్వృత్తిని చేపట్టినాడా ॥నం॥
అందరికన్నా మిన్నగా వున్నాడా ॥నం॥
ఆర్థిక, రాజకీయ, శాస్త్రాలలో పండితుడా ॥నం॥
కానీ, తాను అస్పృశ్యుడుగా మిగిలివున్నాడా ॥నం॥

వ. 1923 సం. తిలక్ మరణించిన తరువాత కాంగ్రెస్ సంస్థకు గాంధీజీ నాయకత్వం వహించాడు. భారత స్వాతంత్ర్య పోరాట వుద్యమంలో అటు ముస్లిం నాయకుడు జిన్నా వున్నాడు కానీ, అస్పృశ్యులుఅనేవారికి గాంధీజీ దృష్టిలో నాయకుడు లేడని తలంచాడు.

# రాజకీయ జీవితం

1924 సం. వీరు రాజకీయాలలో దూకారు ।తం।
ఒక సంఘంను స్థాపించి యున్నారా ,,
దానిపేరే 'బహిష్కృత హితకారిణీ సభ' ,,
ఈ సఘంను ఈయన రిజిష్టరు చేశారా ,,
అందు ఈ క్రింది అంశములను ప్రవేశపెట్టారా ,,

హా:- ఆ అంశయాలేమిట్రా మామా -

1. బహిష్కృత హితకారిణీ సభ ఆధ్వర్యాన స్కూళ్ళను, హాస్టళ్ళను స్థాపించి వాటిద్వారా. వీరిలో విద్యాభివృద్ధి కలిగించుట.
2. పఠనాలయాలద్వారా, సాంస్కృతిక సభలద్వారా, నాటకాలద్వారా నాగరికతను, సంస్కృతిని అభివృద్ధిచేయుట.
3. నిమ్నజాతులకు పరిశ్రమలోను, వ్యవసాయంలోను, సాంకేతికమైన శిక్షణ యిచ్చేందుకు ప్రత్యేకమైన విద్యా కేంద్రాలను ఏర్పాటుచేయుట.
4. నిమ్నజాతుల కష్టనిష్టురాలను ఎప్పటికప్పుడు ప్రభుత్వ దృష్టికి దెచ్చి వాటి పరిష్కారం కోసం కృషి చేయుట మొదలగునవి.

నిమ్నజాతులకు రాజకీయంగా మనోవికాసాన్ని, సంఘ చైతన్యాన్ని కలిగించుటకు ఈ సంఘాన్ని స్థాపించారు.

ఈ సంఘానికి ఉపశాఖలు అనేకములు ॥నం॥
ఆయా రాష్ట్రాలలో ఏర్పాటు చేశారు ॥నం॥
అస్పృశ్యుల సాంఘిక, ఆర్థిక దుస్థితికి ॥నం॥
హిందూమతంలోని వర్ణవ్యవస్థే కారణం ॥నం॥

వ. గాంధీజీ కాని, హిందూ సంస్కరణ సంఘాల వారెవ్వరు గాని హిందూ మతాలలోని వర్ణ వ్యవస్థ నెదిరించకుండ నిమ్నజాతులలో సాంఘికాభి

వృద్ధిని సాధించలేమన్నారు. హిందూమతంలోని వర్ణవ్యవస్థనే నిర్మూలించటంద్వారా అస్పృశ్యతను రూపుమాపవచ్చును. "అత్యంత దీనాతి దీనమైన మీముఖాలను చూస్తున్నపుడు మీరనుభవిస్తున్న కష్టాలనుగూర్చి విన్నపుడు నా గుండెలు దహించుకు పోతున్నవి. నిర్బంధ బానిసవృత్తులుచేస్తూ తరతరాలుగా కృషించి నశించిపోతున్నా, మానాభిమానాలను చంపుకొని మీరు ఆనీచవృత్తులకే కట్టుబడియున్నారు. దానికి ముక్తి మార్గం ఆలోచించడం లేదు. ఈ నీచమైన జీవితాలను గడపటంకంటె పుట్టినవెంటనే చావడం మేలు. ఈదుర్భరమైన జీవితాలతో భూమికే భారంగా మీరెందుకు జీవించాలి? ప్రతి ఒక్కరికి తిండి, బట్ట, వసతి ఏర్పాట్లతో గౌరవనీయమైన జీవనం గడిపే హక్కు వున్నది. ఆత్మ గౌరవం పెరగాలి. స్వయంకృషిపై విశ్వాసం ఏర్పడాలి" అని గంభీర ఉపన్యాసాన్ని యిచ్చారు.

ఈ దేశాన్ని ఎందరో పరిపాలించారు. వారిలో ఎవరైనా మనకు అస్పృశ్యతను విముక్తి గలిగించారా? ఇతరులెవ్వరూవచ్చి మనిల్ని వుద్ధరిస్తారని అనుకోవడం కేవలం అవివేకం. మన సమస్యలేమిటో మనం గ్రహించి వాటిని మనమే పరిష్కరించుకోవాలి.

| | |
|---|---|
| బహిష్కృత హితకారిణీ ఆధ్వర్యమున | ॥తం॥ |
| "సరస్వతీ విలాస్" అను మాస పత్రిక | ,, |
| ఈ పత్రికద్వారా నాగరికతా, సంస్కృతులును | ,, |
| ప్రచారంద్వారా మార్పులు తెచ్చారా | ,, |

వ. 1926వ సం॥న మునగేశన్ అనె ఒక ఆది ద్రావిడకులస్థుడు హిందూ దేవాలయంలోకి ప్రవేశించాడన్న నేరంతో అతన్ని హిందువులు అంతా కలసి చిత్రహింస చేశారు. ఆ వార్త విన్న మన డాక్టరు హృదయంలో అగ్నిజ్వాలలు చెలరేగాయి. జెజూరీ అనె పట్టణంలో ఏర్పాటయిన బహి

రంగసభలో ఉపన్యాసంయిస్తూ దారుణమైనహింసా కాండను ఖండిస్తూ హిందూసమాజంలో సంస్కారభావం రానట్లయితే వీరంతా ప్రత్యేక వలసప్రాంతాలను ఏర్పాటు చేసుకోవలసి వస్తుందన్నారు. దానివల్ల భవిష్యత్తులో ఏర్పడే తీవ్ర పరిణామాలకు హిందువులే బాధ్యత వహించవలసి వుంటుందని హెచ్చరించారు.

బొంబాయిలో వీరు లాయరు ప్రాక్టీసులో ॥నం॥
గొప్ప పేరు మారుమ్రోగుతుంది ,,
బొంబాయిలో ఎం.ఎల్.సి.గా నియమింపబడ్డారు ,,
బొంబాయి సమీపాన కొలబా జిల్లాలో ,,
మహద్ అనె గ్రామానికి ఒకే మంచినీటిచెఱువు ,,
నీటిని ఈ జాతులవారిని వాడనిచ్చేవారు కారా ,,
ఈ జాతులవారు గుంటలలో నీటిని త్రాగాలి ,,
ఆనీటిని త్రాగుతూ నానారోగాలకు గురైరి ,,

## మహద్ గ్రామ చెరువు పోరాటం

1923వ సం. ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారా ॥తం॥
1926వ సం. దానిని కౌన్సిల్ ఆమోదించిందా ,,
ఐనా అసలు సమస్య పరిష్కారం కాలేదా ,,
1927 మార్చిలో సభను ఏర్పాటుచేశారా ,,
ఆ సభకు అందరూ చేరుకొన్నారా ,,
ఆ సభను మన డాక్టరు ప్రారంభించారా ,,
ఆ సభలో వార్ని ఐక్యం కావాలన్నారా ,,

వ. ఆతరువాత సర్వశ్రీ టిప్నిస్, సావర్కర్, చిత్రెయిత్యాది ప్రముఖులు అంతా మహద్ గ్రామంలోని అగ్రవర్ణస్థుల మూఢవిశ్వాసాలను,

మొండివై ఖరిని ఖండిస్తూ వుపన్యసించారు. "అందరు నీళ్ళను వాడుకొనవచ్చును" అని తీర్మానించారు. రెండవ రోజు వుదయం మన డాక్టరు నాయకత్వాన కొంతమందితో కూడిన పెద్దవూరేగింపుగా చౌదార్ చెఱువుకు మేళ తాళాలతో, భజన గీతాలతో, గంభీరంగా నినాదాలతో దిక్కులు మారుమ్రోగేటట్లు బయలుదేరి వెళ్ళి ముందు మన డాక్టరు చెఱువులో దిగి దోసిళ్ళతో నీళ్ళు త్రాగిన తరువాత అక్కడివారందరును త్రాగారు. అప్పుడు వారంతా సంతోషంగా తిరిగివచ్చి ప్రశాంతంగా పందిళ్ళదగ్గర కూర్చొనివున్న సమయాన....

హా:— ఇంతలో ఏం జరిగిందిరా మామా -

అగ్రవర్ణస్థు లప్పుడు సై
బడితకర్ర చేతబట్టిరి సై
వడివడిగా తా వచ్చిరి సై
బందిపోటు దొంగ వలెనుర సై
అందులో నున్నవారి కొట్టారా ॥బళా॥
స్త్రీలు, పిల్లలు చూడర సై
గోల గోలగా ఏడ్చారా సై
నిమ్నజాతీయు లప్పుడూ సై
నివ్వెరపోయిరి నిజముగ సై
ఆత్మ రక్షణకు అప్పుడు సై
ఆగలేదు అరనిమిషము సై
అందరు ముందుకు దూకిరి సై
పందిరి పందిరి పీకిరి సై
నాయకుని మాటకై చూశారా ॥బళా॥
డాక్టరు కావార్త చేరెను సై
పరుగు పరుగున వొచ్చిరి సై

పరవళ్ళు తొక్కుతూ వుండగా — సై
పోలీసులు ప్రత్యక్షమయ్యారా ॥బళా॥

వ. ఆ సమయాన పోలీసు అఫీసరు మనవార్ని శాంతింప చేయాల్సిందిగా డాక్టరును కోరాడు. "మీకుచేతనైతె ముందా అగ్రవర్ణస్థుల్ని అదుపులో పెట్టండి. నా ప్రజల విషయం నే చూచుకుంటాను" అన్నారు. కొంత సేపటికి సర్దుకున్నారు. మహద్ గ్రామములోని అగ్రవర్ణస్థులంతా ఒక చోట సమావేశమై నిమ్నజాతీయుల ప్రవేశంవల్ల మైలబడిపోయిన చౌదార్ చెఱువును పావనం చేసే విషయమై తీవ్రంగా ఆలోచించ సాగారు.

సనాతన-పండితులంతా శాస్త్రాలు తిరగవేశారు. చెఱువు పావనం చేసే మూఢ పద్ధతిని కనిపెట్టారు. కొన్నిబక్కెట్ల ఆవుపేడ, మరికొన్ని బక్కెట్లు మూత్రం, పెరుగు, నెయ్యి తీసికొనివెళ్ళి వేదమంత్రాలు పటిస్తూ చెఱువులోకలిపారు ఆ మూర్ఖ చాందస్సులు. ఈ తంతు చెఱువును పావనం చేయడంకంటె నిమ్నజాతీయులను అవమానించేదిగానే భావించిన డాక్టరు దాడిచేసిన వారిపై కేసు పెట్టాడు. తీర్పు అనంతరం 9 మందికి కఠిన శిక్ష విధించారు. ఈ సమయాన గాంధేయు లెవ్వరు కిక్కురు మనలేదు.

నాటి నిమ్నజాతీయుల్ని ॥తం॥
బానిసలుగా చూచే హిందువులకు ,,
స్వాతంత్ర్యం కోసం పోరాడె నైతిక శక్తి ,,
ఎక్కడిదని మన డాక్టరు అన్నారా ,,
సాంఘిక సమానత జన్మ హక్కు ,,
అస్పృశ్యతా నిర్మూలన ప్రారంభించారా ,,
"బహిష్కృత భారత్" పత్రికను ,,

సంఘ చైతన్యాని కినియోగించారా ॥తం॥
పూనా పట్టణం మాంగ్‌వాడలోని ,,
శ్రీ రాజభోజ్ బహిరంగసభను ఏర్పరచారా ,,
ఆ సభలో ఈయన ఉపన్యసించారా ,,
ఈ జాతులు అన్నదమ్ములవలె వుండాలా ,,
విశ్వవిద్యాలయ సెనెట్ సభ్యులుగా ,,
కొందర్ని ఈ జాతులను నియమించాలా ,,

హో:- తరువాత ఏం జరిగిందిరా బాయి-

చౌదాన్ చెఱువు తగాదా ఆగలేదా ॥విన. నిమ్న॥
వీరిపై పదే పదే దాడి చేస్తూవున్నారా ॥విన. నిమ్న॥
కావున, సర్వసభ్య సమావేశంలో ॥విన. నిమ్న॥
మహద్ పోరాటాన్ని ప్రకటించారా ॥విన. నిమ్న॥
బహిష్కృత భారత్ వార్త విన్నారా ॥విన. నిమ్న॥
వేలకువేలుగా పేర్లను యిచ్చారా ॥విన. నిమ్న॥
స్త్రీలు పురుషులు ముందుకు వచ్చారా ॥విన. నిమ్న॥
కాకిలా నూరేళ్ళు జీవించడం కంటె ॥విన. నిమ్న॥
అలా చావడం అభిమతం కాదన్నారా ॥విన. నిమ్న॥
మానవ హక్కులను సాధించేందుకు ॥విన. నిమ్న॥
ఎలాంటి వాటికైనా వెనుదీయమన్నారా ॥విన. నిమ్న॥
కించపరచుకొనె ఏజాతి పైకి రాదన్నారా ॥విన. నిమ్న॥
ఈ జాతుల అభివృద్ధికోరే ప్రతివారు ॥బళి॥
సమాజంలో సమాన అవకాశాలను ,,
కల్పించుటకు కృషిచేయాలన్నారా ,,
అస్పృశ్యతాజాడ్యం నిమ్నజాతులవార్ని ,,

సర్వవిధాలా నాశనం చేసిందన్నారా ॥బళి॥
దీనివల్ల దేశానికే ముప్పు అన్నారా ”
విద్యాభివృద్ధి కల్గివున్నట్లయితే ”
దేశం సాంకేతికంగా వృద్ధి చెందునురా ”
ఇది జాతీయసమస్యగా తయారయ్యిందా ”

వ. మహద్ పోరాటానికి సన్నాహ మవుతున్న సమయాన తన కడసారి కుమార్డు కన్నుమూశాడు. కావున దుఃఖ భారంతో ఆయన కొన్నాళ్ళ వరకు యింటినుండి కదలలేకపోయారు.

1927వ సం॥ నవంబరు 13వ తేదీన అమరావతి పట్టణంలోని ఇంద్రభవనంలో గొప్ప బహిరంగసభ జరిగింది. దానికి అధ్యక్షోపన్యాస మిస్తూ హర్షధ్వానాల మధ్య ఏమన్నారయా-

దేవాలయంలోని దేవుడు అందరికొక్కడే ॥తం॥
అలా దేవాలయంలో ప్రవేశించి, ”
మ్రొక్కు చెల్లించే హక్కు ప్రతివారికీ వుందా ”
వీరు దేవాలయంలో ప్రవేశించినందువల్ల ”
దేవుడు మైలబడిపోతాడని వాదించడం ”
క్షమించరాని విషయమన్నారా ”
మహద్ చెఱువు పోరాటానికి వచ్చారా ॥తం॥
మనం పుట్టి పెరిగిన జన్మభూమిలో ॥తం॥
మానవ హక్కులు సృష్టించాలీ ॥తం॥
అన్నిటిలోను కుల వ్యవస్థ పోవాలీ ॥తం॥
అన్నివిధాలా వీరు వృద్ధిచెందాలీ ॥తం॥

వ. రెవిన్యూ ఉద్యోగాలు వంశపారంపర్యం కాదన్నారు. మునసబు, కరణంలుగా అన్ని జాతులవార్ని నియమించాలన్నారు. వెట్టిలకు జీతా

లివ్వాలన్నారు. వెట్టివానికొడుకు తప్పనిసరిగా వెట్టివాడుగా వుండాలన్న నిబంధనను రద్దు పరపించారు. వీరిగోడును సైమన్ కమీషన్‌వారికి వివరించి చెప్పిరి.

## నాసిక్ దేవాలయ పోరాటం

హా. తరువాత ఏం జరిగిందిరా మామా.

నాసిక్ పోరాటం ప్రకటించారు.

నాసిక్ దేవాలయంను మూసినారు ॥నిమ్న జా.॥

పూజలు, దేవునికి పూజ్యమయ్యాయి ,,

శ్రీరామనవమి సమీపించిందా ,,

దారిలేకిక రాజీకొచ్చారా ,,

అందరుకలసి పండుగచేశారా ,,

మొదటిరోజు తిరునాళ్ళు సాగిందా ,,

రెండవదినం గండము వాటిల్లె ,,

మీరు ముట్టరాదని పట్టుబట్టినారా ,,

ఆ మాటలకు వీరు ఆశ్చర్యపడిరిగా ,,

హిందువులపై తిరుగబడ్డారా ,,

హా. అప్పుడేం జరిగిందిరా బాబాయి -

కర్రలు, కత్తులు, బాకులు ॥సై॥

పెళ పెళమని మెరసెను ॥సై॥

కద్రేకర్ అను యువకుడు ॥సై॥

బాణా కర్ర చేత బట్టెను ॥సై॥

చేజిక్కిన వారిని గొట్టెను ॥సై॥

బుర్రలతో ఆట లాడెను ॥సై॥

చివరకు అటువులు బాశాడా ॥బళా॥

అలజడి అంతటితో ఆగలేదా ॥బళా॥
ఆరు సంవత్సరాలు సాగిందా ॥బళా॥
అన్ని ప్రాంతాలకు ప్రాకిందా ॥బళా॥
ఎవ్వరూ కిక్కురుమనలేదా ॥బళా॥
సైమన్ కమిషన్ రిపోర్టు తప్పులా ॥బళి॥
దీనిపై నిరసనపత్రం పంచినారా ॥బళి॥
వీరికి ప్రత్యేక రాజకీయ రక్షణలవసరమా ॥బళి॥

హా. ఇంకేమన్నారయా—

స్వతంత్ర భారత దేశంలో ॥నం॥
పాలకులుగా వుండగోరుమన్నారు ॥నం॥
మొదటి రౌండ్ టేబిల్ సమావేశం ॥నం॥
లండన్‌లో ఏర్పాటు చేశారూ ॥నం॥
దానికి యీ జాతుల తరపున ॥నం॥
మన డాక్టరును ఆహ్వానించారూ ,,
సమావేశంకు ప్రాతినిధ్యం లభించుట ,,
మన వారికి అపూర్వమైన అవకాశం ,,

## రాజకీయ రక్షణలు

వ. ప్రపంచంలో మరెక్కడాలేని అస్పృశ్యతనే సాంఘిక దురాచారానికి గురై పౌరహక్కులనేవి ఏవి అనుభవించకుండా వున్నారన్న సత్యాన్ని గుర్తించగలరన్నారు. ఒక కులంపై మరొకకులం పెత్తనం చేయడం కుదరదు. అధ్యక్షా నేను ఒక నిజాన్ని మీ ముందుంచుచున్నాను. మాకు హితుడనేవాడేలేడు. బ్రిటిష్ ప్రభుత్వం మా విషయంతో పట్టించుకొన

లేదు. హిందువులకు మేమంటేనే మంట. మహ్మదీయులందు మాస్వార్థపరులు ప్రభుత్వంచే నిర్లక్ష్యం చేయబడి, హిందువులచే అణగద్రొక్కబడి మహ్మదీయులచే నిరాదరించబడ్డవారు వీరు. పేదరికంలోను, నిస్సహాయతలోను వీరికి వీరే సాటి!.... ఈ విధాన ఉపన్యాసం గంభీరంగా సాగింది. అన్ని పత్రికలు వేనోళ్ళ కొనియాడాయి. మన కొరకు రాజకీయ రక్షణలు కోరుతూ విజ్ఞాపన పత్రాన్ని ప్రభుత్వానికి సమర్పించారు.

1. సమాన పౌరసత్వపు హక్కు :
2. హక్కులను స్వేచ్ఛగా అనుభవించే అవకాశం :
3. వర్ణ వివక్షతల నుండి రక్షణ ;
4. శాసన సభల్లో ప్రాతినిధ్యం :
5. ప్రభుత్వ ఉద్యోగాలలో ప్రాతినిధ్యం :
6. ఈర్ష్య, నిర్లక్ష్యతల నుండి రక్షణ :
7. వీరి సంక్షేమంకోసం ప్రత్యేకశాఖ :
8. మంత్రి వర్గంలో ప్రాతినిధ్యం :

## రౌండ్ టేబిల్ సమావేశం

ఈ షరతులను ఇంగ్లండు మేధావు లంతా సమర్థించారు. సమావేశాన్ని ముగించుకొని అక్కడ నుండి భారతదేశానికి 1931 ఫిబ్రవరి 27 నాటికి తిరిగి వచ్చారు.

వీరి రాకవిన్న సేవాదళం యాజమాన్యాన వేలాది ప్రజలు "బాబా సాహెబ్ వర్ధిల్లాలంటూ" మిన్నుముట్టేటట్లు నినాదాలతో ఎదురేగి స్వాగతం యిచ్చారు.

బొంబాయి నగరంన శ్రీ యస్. శివరాజ్ అధ్యక్షతన మన డాక్టరు సన్మానసభ ఘనంగా ఏర్పాటయింది.

రాష్ట్రాల నుండి ప్రతినిధులొచ్చారా ॥బళా॥
బ్రహ్మాండమైన ప్రసంగాలిచ్చారా ॥బళా॥
సన్మానం ఘనంగా జరిగిందా ॥బళా॥
"జనతా" పత్రిక ఏర్పరచినారా ॥బళా॥

వ. గాంధీజీకి మనకు ప్రత్యేక నియోజక వర్గాలుండటం ఏమాత్రం యిష్టం లేదు. ప్రతి కాంగ్రెస్ సభ్యుడు విధిగా ఖద్దరు కట్టితీరాలన్న నియమం లాగె మాతో కలసి భోజనం చేసేందుకు నిరాకరించిన వారికి కాంగ్రెస్ సభ్యత్వమివ్వకూడదన్న నిబంధన ఎందుకుపెట్టకూడదు? అన్నారు.

నా ప్రజలకు దాస్య విముక్తి కలగాలన్నారా ॥తం॥
రౌండ్ టేబిల్ సమావేశానికి బయలుదేరినారా ॥తం॥
దేశవ్యాపితంగా సభలు, జరపాలన్నారా ॥తం॥
సభలో ప్రవేశపెట్టిన ప్రతిపాదనలు ॥తం॥
బలపరుస్తూ తీర్మానాలను పంపాలన్నారా ॥తం॥
డాక్టరు మా నాయకుడన్నారా ,,
తీర్మానాలను లండన్‌కు పంపారా ,,
సమావేశానికి బ్రిటిష్ ప్రధాని ,,
రామ్సే మెక్డొనాల్డ్ అధ్యక్షతన ,,
అల్ప సంఖ్యాకులే అంగీకారంకు రాలేక ,,
నిర్ణయం బ్రిటిష్ ప్రధానికి వదిలారా ,,
దీనికి గాంధీజీయే కారణమన్నారా ,,

వ. ఇంతలో నాసిక్ దేవాలయ పోరాటం ముమ్మరంగా తయారు అయింది. వీరికి అగ్రవర్ణాలవారు దేవాలయ ప్రవేశం యివ్వకున్నారు. ఈ ప్రభావం లండన్‌లోని గాంధీజీపై పడింది.

నిమ్న జాతులు హిందువులేనంటు ॥వం॥
గాంధీజీ వాదించటం అర్థంలేనిదని ,,
"లండన్ టైమ్సు" పత్రిక వ్రాసింది ,,
మన డాక్టరు బాధ్యతలు, భావాలు ,,
వాస్తవమైనవిగా వున్నాయా ,,
కంటికి రెప్ప ఎంత దగ్గరో ,,
వీరి క్రియన అంత దగ్గరన్నారా ,,

వ. వీరి విషయంలో గాంధీజీ చూపె శ్రద్ధ కేవలం వూహా మాత్రమైనదని ప్రముఖ రచయిత శ్రీ గ్లార్క్ అన్నారు.

1931 డిశంబరు 27న గాంధీజీ భారతదేశంలో అడుగు పెట్టగానే వేలాది నిమ్న జాతీయులు నల్లజెండాలతో ప్రత్యక్షమయినారు.

మన డాక్టరు బొంబాయి హార్బరుకురాగానె ఆనంద ఉత్సాహాలతో యెదురేగి పూల మాలలతో స్వాగతమిచ్చారు. రౌండ్ టేబిల్ సమావేశంలో పీడిత జాతుల తరవున ఎంతో శాకసక్యంగా నిర్వహించినందుకు కృతజ్ఞతగా బొంబాయి ప్రభుత్వంవారు "జస్టిస్ ఆఫ్ పీస్ [శాంతి రక్షకుడు] అనే బిరుదుతో ఘనంగా సన్మానించారు. రాజా, ముంజె అనువారు ప్రత్యేక నియోజకవర్గాల విషయంలో కొంత గడబిడచేసినా చివరకు మన డాక్టరు కృషిఫలితంగా ప్రత్యేకనియోజకవర్గాలు ఆమోదింప బడ్డాయి. మహ్మదీయులకు, సిక్కులకు క్రైస్తవులకు, ఆంగ్లోఇండియన్లకు ప్రత్యేక ప్రాతినిధ్యం యివ్వడంవల్ల దేశానికి హానివుండదు గాని నిమ్నజాతీయులకు మాత్రం ప్రత్యేక రక్షణలు యిచ్చినందువల్ల హిందూమతం దెబ్బతింటుందని గాంధీజీవాదన. దీనికిగాను గాంధీజీ అమరణ నిరాహారదీక్ష పూనడం వుత్త దండుగన్నారు.

గాంధీజీపోతే హిందువులె కారణమన్నారా ||తం||
దీక్షను విరమింప జేయమన్నారా ,,
మమ్మల్ని సమానతతో జూడలేనప్పుడు ,,
మీ కనుకూలమైన రాజకీయ విధానాన్ని ,,
మీ మతానికి కట్టుబడి వుండాలనిగాని ,,
ఆశించె హక్కు మీకు లేదన్నారా ,,
సప్రూ పథకం అమలులోకి రాలేదా ,,
కాలనిర్ణయంపై యిరువుర కంగీకారం లేదా ,,

## పూనా ఒడంబడిక

ఇంతలో గాంధీజీ కుమారుడు దేవదాస్ గాంధీ వచ్చి అక్కడున్న మన డాక్టరు మొగంచూచి బావురమని ఏడ్చినాడు. ఆ దృశ్యం చూచిన మన డాక్టరు ఉక్కుగుండె సహితం కరగి గాంధీ ప్రాణరక్షణ విషయంలో వీలైనంతవరకు తన పట్టుదలను సడలించుకొనుటకు సిద్ధమయ్యారు.

ప్రత్యేక రక్షణలు 25, 20 సం॥లు గాంధీజీ అంగీకరించలేదు. 5 సం॥లు అని సైగ చేసినాడు. కాని మన డాక్టరు 10 సం॥లు అని పట్టుబట్టి అట్లు అంగీకరింప చేశారు.

అప్పుడు పూనా ఒడంబడిక ఈ క్రింది విధంగా జరిగినది.

1. అన్ని రాష్ట్రాలకు కలసి మొత్తం 148 ప్రత్యేక స్థానాలు యివ్వాలన్నారు.

2. కేటాయించబడ్డ నియోజకవర్గంలోని నిమ్నజాతీయులంతా కలసి మొదట నలుగురు అభ్యర్థుల్ని ఎన్నుకోవాలి. ఆ నలుగురులోను ఒక్కర్ని మాత్రమే వీరు, హిందువులు కలసి ఎన్నుకుంటారు.

3. పైన చెప్పబడ్డ పద్ధతి ప్రకారమే కేంద్ర, శాసన సభలకు కూడ నిమ్న జాతీయ ప్రతినిధులెన్నుకోబడాలి.

4. కేంద్ర, శాసనసభలలోగల మొత్తం స్థానాల్లో 18 శాతం వీరికై కేటాయించబడవలెను.

5. ప్రత్యేక ప్రాతినిధ్యం పదేళ్ళవరకు వుండాలన్నారు.

6. భారత జనాభా లెక్కలనుబట్టి ఓటింగు జరపాలన్నారు.

వీరిపై యికమీదట అగ్రవర్ణాలవారు దౌర్జన్యంగాగాని, అమర్యాదగా గాని, అస్పృశ్యతా దృష్టితోగాని ప్రవర్తించడం జరుగరాదు. ప్రజా సంస్థల్లోను, ప్రభుత్వ ఉద్యోగాలలోను వీరికెట్టి అన్యాయం జరగకుండా అర్హతనుబట్టి వారికి వీలైనంతగా ప్రోత్సాహమివ్వాలన్నారు. ప్రతి రాష్ట్రంలోను విద్యావ్యాప్తికై ప్రభుత్వం కేటాయించే ధనంలో కొంతభాగం వీరికి కేటాయించాలన్నారు.

కమ్యూనల్ ఎవార్డులో మనవారికి 78 స్థానాలు యివ్వబడ్డాయి. పూనా ఒడంబడికపై గాంధీ, అంబేడ్కర్‌లు మరి యింకా కొంతమంది పెద్దలు సంతకాలు చేశారు.

1932వ సం॥ నవంబరు 17వ తేదీన మూడవ రౌండ్‌టేబిల్ సమావేశం లండన్‌లో ఏర్పాటయింది.

హా :- సమావేశంలో ఏం జరిగిందిరా మామా -
ఈ సమావేశంలో కాంగ్రెస్ పార్టీ పాల్గొనలేదా ॥తం॥
మన డాక్టరు, మహాత్మాదీయులు పాల్గొన్నారా ,,
1, 2 సమావేశాలలో చర్చించి నిర్ణయించబడ్డ ,,
అంశాలను చట్టరూపంలో రచించడమే ,,
ఈ సమావేశం ముఖ్యవుద్దేశ్యమయిందా ,,
రచన అనంతరం సమావేశం ముగిసిందా ,,

"గురువాయూర్ దేవాలయంలోనికి నిమ్న జాతీయులు ప్రవేశించడం ఆ దేవునికే యిష్టం లేదేమో" అని గాంధీ అన్నారు.

వ. "మనం పేటినైతే కోల్పోయామో వాటిని అగ్రవర్ణాల వారు మనినుండి కాజేశారు. మనం నష్టపడితే వారికి లాభం. మనం ఏడిస్తే వారికి ఆనందం. మనకు స్థిరచరాస్తులు లేవంటే వాటిని మనం పోగొట్టు కున్నామని, అగ్రవర్ణాలవారు వాటిని మన నుండి నయాన, భయాన, అచ్చిక బుచ్చికలాడి, కళ్ళకు మసిబూసి, మాయచేసి దోచుకున్నారని గ్రహించాలి" అని మన డాక్టరు గుర్తు చేస్తున్నారు.

కర్మ అనేదే లేదన్నారా ॥విన. నిమ్న॥
యిదే హిందువులు నీకు నేర్పిన పాఠం ,,
అదే నిన్ని దుస్థితికి తెచ్చింది ,,
మన భవిష్యత్తు పుట్టుకపై లేదు ,,
పూర్వజన్మపైన అసలే లేదు ,,
స్వశక్తిపైననే ఆధారపడింది ,,
చర్చిల్ ప్రసంగంలో కొన్ని ,,
అత్యంతరకర విషయాలున్నాయా ,,
బొంబాయిలో రాజగృహ నిర్మాణం ,,
ఐదు అంతస్థుల భవనం తయారు చేశారా ,,
గ్రంథాలయంకు ఎక్కువ కేటాయించారా ,,
లండన్‌లోని మ్యూజియంను పోలివుంటుందా ,,
రమాబాయి మన డాక్టరుకు తగిన ధర్మపత్నియా ,,
ఈమెలో దైవభక్తి మెండుగా వుండేదా ,,

వ. కావున భార్య రమాబాయి పండరీపురంలో పాండురంగ స్వామి మ్రొక్కుబడి తీర్చుటకు వెళ్ళుదామన్నది. కాని అమాయకురాలైన

ఆమెకు అసలు విషయం తెలియదు. అప్పుడు మన డాక్టరు కోపగించు కొన్నారు. అయినప్పటికి భార్యను దగ్గరకు బిల్చి పండరీపుర దేవాలయం అస్పృశ్యురాలవైన నీకోసం నిర్మించబడలేదు. ఆ దేవాలయం లోకి నిన్ను రానివ్వరు. ఆ పండరీపురం మన కక్కర్లేదు. త్యాగ దీక్షతో పీడిత కులాలవారికి నిస్వార్థమైన సేవ చేయడం ద్వారా మన యింటినే పండరీపురంగా మార్చుకోవచ్చునన్నారు.

ఎన్ని కష్టాలనైనా భరిస్తానన్నారా ॥విన. విన్నా॥
యావద్భారతంలోని ఈ జాతీయులందర్నీ ,,
ఒక్క జెండా క్రిందికి తేవాలన్నారా ,,
వ్యక్తిగత విబేధాలతో పని లేదన్నారా ,,
పీడిత జాతుల సమస్యల విషయంలో ,,
పదికోట్ల ప్రజానీకం ఒక్కటి కావాలా ,,

వ. అనారోగ్యంతో రమాబాయి అంబేడ్కర్ బాగా క్షీణించింది. కాగా, 1935 మే నెల 27వ తేదీన మహాసాధ్వి శ్రీరమాబాయి అంబేడ్కర్ శాశ్వతంగా కన్ను మూసింది. మన డాక్టరు పసిపిల్లవానివలె రోదించారు. ఈ సంఘటన చూచి ప్రజానీకమంతా దుఃఖించింది.

## కుల నిర్మూలన

యోలా మహాసభ కాహ్వాన సంఘాధ్యక్షుడు ॥తం॥
శ్రీ రణ్ కాంబే సభను ప్రారంభించారా ,,
బ్రాహ్మణులు హిందూ మతాన్ని ,,
స్వార్థ ప్రయోజనాల కోసం సృష్టించారా ,,
అందుచేత దీన్ని హిందూమతం అనేకంటె ,,
బ్రాహ్మణ మతం అనటం మంచిదన్నారా ,,

దురదృష్టవశాత్తు నేను హిందువుడిగా పుట్టినా ॥తం॥
హిందువుడిగా మాత్రం చావనన్నారా ,,
హిందూ మతంలోనిదేవుళ్ళంతా ఏకమైనా ,,
ఆమతాన్ని సంస్కరించ లేదన్నారా ,,

వ. పంజాబు రాష్ట్రంలో కొంతమంది హిందూ సంస్కర్తలు కలసి జాత్ పాత్ తోడక్ మండల్ అనగా కులతత్వ నిర్మూలనా సంఘం అనే పేరుతో లాహోరు నగరంన ఏర్పాటు చేశారు. దాని ఆశయాల మేరకు ప్రచారం బాగా సాగింది. కాగా ప్రజలయొక్క మన్నలు పొందింది. ఈ సంఘం వారు వార్షిక మహాసభను జరపాలని తలచి ఏం చేశారయా-

అధ్యక్షునిగా ఈయనను ఎన్నుకున్నారా ॥విన. విన్న॥
ఆ వార్తను వీరికి అందజేసినారా ॥విన. విన్న॥
వెంటనే ఆ సంఘంవారిక్ జవాబిచ్చారా ॥విన. విన్న॥
హిందూ నాయకుల సంస్కరణలపై ॥విన. విన్న॥
తన కట్టై నమ్మకం లేదన్నారా ॥విన. విన్న॥
చివరకు అంతే జరిగిందా ॥విన. విన్న॥

వ. ఈ నెలరోజులు కష్టించి ఎంతో కృషిచేసి అనారోగ్యంను లెక్కచేయక మహత్తర పరిశోధనా గ్రంథమును అధ్యక్షోపన్యాసంగా తయారుచేశారు. ఈ గ్రంథమునుచూచి ఆమండలివారు జడిశారు. కొంత మార్చమన్నారు. కాని ఒక మాటకాదు, చివరకు ఒక కామా కూడ మార్చనన్నారు వారు వార్షిక సభను వాయిదా వేసుకొన్నారు.

అది "ఆనిహిలేషన్ ఆఫ్ కాస్ట్" [కుల నిర్మూలన] అనే గ్రంథంగా మార్కెట్టుకు వచ్చింది. వచ్చిందే తడవుగా కాపీలన్నియు వెంటనే అమ్ముడు పోయాయి.

వం. అందలి విషయాలు కొన్ని క్లుప్తంగా చెప్పారా....

కుల నిర్మూలనకు వ్యతిరేకుల విమర్శించారా ॥విన. నిమ్న॥
వర్ణాశ్రమ ధర్మమనె గాంధీజీ తన వంశవృత్తియైన ,,
వ్యాపారాన్ని విడచి న్యాయవృత్తి ఎందుకు పట్టారా ,,
వర్ణసంకరాన్ని వ్యతిరేకించె గాంధీజీ తన కుమారునకు ,,
బ్రాహ్మణుడైన రాజగోపాలచారి కుమారునితో ,,
ఎందుకు పెండ్లి చేశాడన్నారా? ,,
అతి ముఖ్యమైన హిందూ సిద్ధాంతము ,,
తనపట్ల మాత్రం వర్తించవన్నారా ,,
యింతకంటె అవకాశవాదం లేదన్నారా? ,,
దాదర్ సభకు రెవ. స్టాన్లీజోన్స్ హాజరయ్యారా ,,
"ఒకేదేశం, ఒకేప్రజ" అనే సిద్ధాంతంపై ,,

వ. ఇండిపెండెంట్ లేబరు పార్టీని స్థాపించారు.

ఆనాడు ప్రచారం జాగా సాగిందా ॥బళా॥
మనవారు నాయకత్వంపై నమ్మకముంచారా ,,
దానికి నిదర్శనం బొంబాయి రాష్ట్రింన ,,
బొంబాయి రాష్ట్రింన 17 రిజర్వుడుకు ,,
16 స్థానములు రిజర్వుడని గెలుచుకొన్నదా ,,

వ. ఆనాటి నుండి ఈనాటి వరకు ఈ పార్టీ రాజకీయంగా పుంజుకోలేదు గాని, కొన్ని స్థానాలు మాత్రంకొన్ని రాష్ట్రాలలో నిలుపుకుంటుంది.

బొంబాయి శాసనసభలో వ్యవసాయ రంగంలో నిర్బంధ సేవా వృత్తిని రద్దు చేయాలంటూ ఒక బిల్లును మన డాక్టరు ప్రవేశపెట్టారు.

1937లో ప్రవేశపెట్టబడ్డ బిల్లు తరువాత ఆమోదింపబడి అది చట్టరూపం పొందేవరకు 20 సం.లు పట్టింది.

బొంబాయి కోర్టులో 7 గం. నిర్విరామంగా ॥తం॥
వాదించి మన డాక్టరు క్రొత్త రికార్డు స్థాపించారా ,,
మన డాక్టరు వాదనాపటిమ గొప్పదన్నారా ,,

వ. 1937వ సం. డిశంబరు 30 తేదీన షోలాపూర్ జిల్లాలో పర్యటిస్తూ యిలా అన్నారు.

హా. :- ఇలా అని ఏలా అన్నారు మన డాక్టరు.

కాంగ్రెస్‌వారు ధరించె ఖాదీ బట్టలు ॥నం॥
టోపీ ఎంత తెల్లగా వుంటాయో ,,
వాళ్ళ ఆలోచనలు, పనులు అంత నలుపు ,,
మాటలు తేనెలా తీయగ వుంటాయో ,,
పనులు మాత్రం వట్టివి అన్నారా ,,
శ్రామికులను దోచుకునేందుకు ,,
ఈ పెద్దలు అవతరించారా ॥తం॥
కమ్యూనిష్టులు స్వార్థపరులన్నారా ॥నం॥
వీరిని బలిపశువుగా వాడుకుంటున్నారా ,,
సమాజంలో దోచుకొనె వర్గం ,,
దోచుకోబడేవి రెండే కాకుండా ,,
వీటిలో మధ్యతరగతి వర్గం వున్నదన్నారా ,,
దోచుకోబడే వారంతా కలవాలన్నారా ,,
మధ్యతరగతి వర్గాన్ని కలుపుకోవాలన్నారా ,,
దోచుకొనేవారిపై దండయాత్ర చేయాలి ,,

"హరిజన్" అనేది గాంధీజీ పెట్టిన పేరన్నారా ॥నం॥
హరిజన్ అని పిలిచినా పలుకవద్దన్నారా ,,

## వతన్ పద్ధతి రద్దు

వ వ్యవసాయ కూలీ కుటుంబాలను నిర్బంధ దాస్యానికి గురిచేస్తున్న "వతన్" పద్ధతిని రద్దుచేయాలి. కార్మిక సమస్యలపట్ల ఏ ప్రభుత్వం శ్రద్ధ వహించుతుందో ఆలాటి పార్టీని అధికారంలోకితెచ్చే విషయంలో కార్మిక సంఘాల పాత్ర గణననీయమైనదన్నారు. జీతాల పెంపుదల, బోనస్, పెన్షన్‌వంటి సమస్యలపై పరిపూర్ణమైన పరిజ్ఞానం కలిగి వాటి విషయంలో కేంద్ర, రాష్ట్ర శాసన సభలలో పోరాడగల వ్యక్తుల్ని ఎన్నిక చేసుకోవలసిన బాధ్యత కూడ యీ కార్మిక సంఘాలపైన వున్నది.

ప్రభుత్వ విధానాలు కార్మికులకు హానికరంగా వున్నప్పుడు ఆ ప్రభుత్వాన్ని మార్చి మరో ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసేశక్తి కార్మిక సంఘాలలో ఏర్పడాలి.

## ప్రతివాద భయంకరుడు

హా. మన డాక్టరు ప్రతివాద భయంకరుడు అంటారు. ఎట్లారా బెదరు.

వ. బొంబాయి నగరంలో శాంతి భద్రతలపేరున పోలీసులు కాల్పులు జరిపారు. కాగా, అగ్గిమీద గుగ్గిలంజల్లినట్లయి మన డాక్టరు చివాలునలేచి ఈ సమ్మెలో నేనూ వున్నానూ నన్ను విచారించి శిక్షించగల దమ్ము లున్న వారెవ్వరో ముందుకురండి. శాంతిభద్రతలతో ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను హరించివేసే హక్కు ప్రభుత్వానికెక్కడిది? ప్రజలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేనప్పుడు స్వయం పరిపాలనదేనికి? స్వయం

పరిపాలన అంటె దానర్ధం తుపాకి పట్టుకొని ప్రజానీకాన్ని పక్షుల్ని కాల్చినట్లు చంపడమేనా? మరి నన్నెందుకు అరెస్టు చేయలేదు. నాపై విచారణ ఎందుకు జరిపించలేదు."

ఈ విధంగా పాలకవర్గంపై ప్రశ్నల వర్షం కురిపించి ప్రతివాద భయంకరుడుగా పేరుగాంచారు మన డాక్టరు.

ఆ సమయాన రెండవ ప్రపంచ యుద్ధం ॥తం॥
వుధృత రూపం బాగా దాల్చిందా ,,
ఆనాటి ప్రభువు భారతీయులంతా ,,
బ్రిటిషు ప్రభుత్వంకు అండగా వుండాలన్నారా ,,
ఈ ప్రకటనను మన డాక్టరు సపోర్టు చేశారా ,,
మహ్మదీయులు తమకు పాకిస్తాన్ కావాలంటూ ,,
పెద్ద ఆందోళన ఇండియాలో లేవదీశారా ,,
ఈ గొప్ప ఆందోళన ఫలితంగా ,,
దేశవిభజన జరగడమనేది తప్పనపుడు ,,
నిమ్న జాతీయులు తమ భవిష్యత్తును గూర్చి ,,
నూతనంగా ఆలోచించాల్సి వుంటుంది ,,

వ. అప్పుడు నెహ్రూజీవచ్చి మన డాక్టరుతో సంభాషణలు జరిపినారుగాని లాభంలేకపోయింది. ఇంకా ఎంతోమంది పెద్దలు వచ్చి ఎన్నో ఆశలు చూపారుగాని అందుకు నాజాతి దెబ్బతింటుందని నమ్మినవారు కాన ఒప్పుకొనలేదు.

దేశ క్షేమానికి ఎక్కువ ప్రాధాన్యత యిచ్చారా ॥తం॥
దేశ క్షేమంతోపాటునే పుట్టి పెరిగిన ,,
నాజాతి ప్రజల సంక్షేమాన్ని ,,

నే నెప్పటికి విడువలేనన్నారా ॥తం॥
వీరిలో విద్యాభివృద్ధితోపాటు ,,
సైనిక శిక్షణ చాలా అవుసరమన్నారా ,,
సైన్యంలో చేరి పౌరుషాన్ని, చైతన్యాన్ని ,,
క్రమశిక్షణను అలవరుచు కొనవచ్చునన్నారా ,,
స్వయంగా మన డాక్టరు ఎంతోమందిని ,,
సైన్యంలో ఎక్కువగా చేర్పించారా ,,

వ. క్రిప్స్ ప్రభువు మన డాక్టరును కార్మిక నాయకత్వమో లేక నిమ్న జాతీయుల నాయకత్వమో యీ రెండింటిలో ఏదో ఒకటి వదలుకోవల సిందిగా కోరారు.

## ఆల్ ఇండియా షెడ్యూల్డు కాస్ట్స్ ఫెడరేషన్ స్థాపన

కావున మన డాక్టరు అపుడు కార్మికనాయకత్వాని వదలుకున్నారు. వీరి జీవిత చరిత్రలో యిది గొప్ప చరిత్రాత్మక సంఘటన. వైస్రాయ్ పేరుతో యావద్భారత్ పరిపాలనకు గాను కార్యనిర్వాహక వర్గంలో మన డాక్టరు మొట్టమొదటి వారుగా తీసికోబడ్డారు. అది ఈ జాతికి గర్వకారణం.

ఆల్ ఇండియా షెడ్యూల్డు కాస్ట్స్ ఫెడరేషన్ ॥తం॥
అనె క్రొత్త పార్టీని ఈయన స్థాపించారా ,,
ఈ సందర్భాన మన డాక్టరు ,,
మంచి వుపన్యాసం యిచ్చారా ,,

వ. నిజాయితీ, తెలివితేటలతోపాటు ప్రజాహిత ధ్యేయమనేది వున్నవాడె గొప్పవారు. సమాజంలో జరుగుతున్న అన్యాయాన్ని, అక్రమాన్ని అరి

కట్టేందుకు మంచి మనస్సుతో యుక్తాయుక్త విచక్షణా బుద్ధితో పని చేసిన వారే గొప్ప వ్యక్తిత్వానికి మాదిరి.

విద్యా వుద్యోగాలలో ఈజాతిప్రాతినిధ్యం కోరడంపై అగ్రవర్ణాల వారు చూపుతున్న అసూయను మన డాక్టరు ఖండించిరి. దేశం హిందువులకు, మహ్మదీయులకు మాత్రమే హక్కు భుక్తంగాదని, దేశ వనరులన్నింటిలో ఈ జాతికి న్యాయమైన వాటావారికి యివ్వక తప్పదు. ప్రభుత్వ యంత్రాంగంలోను, ప్రజాసంస్థలన్నింటిలోను ఈజాతికి సమానప్రాతినిధ్యం లభించేందుకు ఈ సమాఖ్య పోరాటం కొనసాగించాలి.

కార్మికులకు శెలవురోజుల్లోకూడ జీతాలివ్వాలనే అంశంపై ఒక బిల్లు తానే స్వయంగా రచించారు.

కనీస వేతనాల చట్టాన్ని, బోనస్ చట్టాన్ని ॥నం॥
కార్మికులకు వర్తింప చేయాలన్నారా ,,
వతన్‌దారీ, కోఠీ పద్ధతులపై ,,
నిర్బంధ దాస్యంపై పోరాడాలన్నారా ,,

వ. ఆనాడు కోట్ల నిమ్నజాతీయులకు అవసరమైన రాజకీయ రక్షణలను రూపొందించాల్సిన బాధ్యత బ్రిటిష్ ప్రభుత్వంపై వున్నది. ఈ జాతి ప్రతిపాదనలు యధాతథంగా అంగీకరించేందుకు హిందూ మహాసభ నాయకుడైన డా॥ ముంజె సిద్ధమయ్యారుగాని, హరిజనోద్ధారకుణ్ణి అని చెప్పుకొనుచున్న గాంధీజీ మాత్రం అందుకు సుతరాం ఒప్పుకోలేదు.

ఈ జాతీయుల నిజమైన హక్కులను గాంధీజీ అంగీకరించె పక్షంలో తాను కాంగ్రెస్‌లో చేరేందుకైనా సిద్ధమేననివీరన్నారు. కాని డా॥అంబేడ్కర్ కాంగ్రెస్‌లో చేరే పక్షంలో రాష్ట్రపతిగా ఎన్నుకొనేందుకైనా గాంధీజీ సిద్ధపడతారుగాని ఈ జాతికి ప్రత్యేక ప్రాతినిధ్యానికి మాత్రం

అంగీకరించరు. కాగా ఈ జాతి హిందూ మతానికి ముడిపెట్టబడి యున్నం తకాలం వీరికి విముక్తిలేదు. అపుడు వీరు యేమతానికి చెందని ఒక ప్రత్యేక ప్రతిపత్తిగా గుర్తించాలంటూ.

మన డాక్టరు తన శంఖాన్ని పూరించిన మీదట యావద్భారత నిమ్న జాతీయులంతా తిరిగి సమర సన్నాహాలు మొదలుపెట్టిరి.

## దక్షిణ భారతదేశ పర్యటన

దక్షిణ భారతదేశ పర్యటన ప్రారంభించారా ॥త౦॥
ఈ జాతీయులెల్లరు బాబావార్తను విన్నారా ,,
తమ నాయకుని కన్నులారా చూశారా ,,
తన అమూల్య సందేశాలను విన్నారా ,,

వ. 1944 సెప్టెంబరు 20వ తేదీనాటికి మనడాక్టరు హైదరాబాదును చేరుకొన్నారు. ఆ బహిరంగ సభలో చారిత్రక సత్యాలను ఆచార వ్యవహారాలను బట్టి నిమ్న జాతులు హిందూమతంతో ఏలాంటి సంబంధం లేని ఒక ప్రత్యేకమైన వర్గంగా గుర్తించక తప్పదన్నారు.

ఆ కారణంచేతనే ఈ జాతీయులు రాజ్యాంగ చట్టరీత్యా ప్రత్యేక రాజకీయ రక్షణలు కావాలంటున్నారు. హిందువుల్లో ఎంతటి దేశభక్తివున్నదో ఈజాతిలోకూడా అంతటి దేశభక్తివున్నది. కాకుంటే దేశస్వాతంత్ర్యంతో పాటు తనుకూడ స్వాతంత్ర్యం లభించాలని మాత్రమే నిమ్న జాతీయులు కోరుతున్నారు.

అచటినుండి మద్రాసు చేరుకున్నారు.

సర్వశ్రీ రాజ్‌బోజ్. ఈలివాడపల్లి, శివరాజ్, ఏకాంబ్రం, అరుణ కుమార్, కోనాడ మొదలగువారు ఘనంగా స్వాగతమిచ్చారు.

వీరి అమూల్య సందేశాలను చక్కగా విన్నారు.

ఈ జాతీయులు, వారి కార్యకర్తలు వేలాదిగా సభలకు విచ్చేసి స్వాగతపత్రాలను సమర్పిస్తూ మాకు ఇండ్లు మంచినీటిబావులు, చెరువులులేవు. మా పిల్లలు చదువు కొనేందుకు అవకాశాలు లేవని ఎంతోమంది చెప్పుకొన్నారు.

వీరి గోడును డాక్టరు అతిశ్రద్ధగా విన్నారా ॥తం॥
ఎంతో బాధతో నిట్టూర్పు విడిచారా ,,
మన కష్టాలు నా ఒక్కడితోనే పరిష్కారంకావు ,,
మనమంతా ఏకం కావాలన్నారా ,,
నిరంతర పోరాటం సాగించాలన్నారా ,,

వ. శ్రీరాపూరి ఏకాంబ్రం ప్రజాకవి నాయకత్వాన మనప్రాంతం గుడివాడ, విజయవాడ, ఏలూరు, కాకినాడ, విశాఖపట్నం మొదలగు పట్టణాలను దర్శించి ప్రసంగించి వీరియొక్క మన్ననలను ఘనంగా పొందారు.

ఆంధ్రరాష్ట్రింన ఆదిమాంధ్రులు ॥బళి॥
మహారాష్ట్రింలోని మహారులకు ,,
ఏమాత్రం తీసిపోరన్నారా ,,

"పీపుల్స్ హెరాల్డు" పత్రిక కలకత్తాలో శ్రీ జాదవ్ సంపాదకీయంతోటి "జై భీమ్" ఇంగ్లీషు పత్రిక మద్రాసులో శ్రీ యన్. శివరాజ్ సంపాదకత్వాన-

"ఆది హిందూ" పత్రిక హైదరాబాదులోని శ్రీ భాగ్యరెడ్డివర్మ స్థాపించిన-

"జయభేరి" పత్రిక రాజమండ్రిలో శ్రీ కుసుమధర్మన్న కవి స్థాపించారు.

"వాట్ కాంగ్రెస్ అండ్ గాంధీ హేవ్ డన్ టు ది అంటచ్ బిల్స్ ?" [కాంగ్రెస్, గాంధీజీ అస్పృశ్యులకు చేసిందేమిటి ?] అనె గ్రంధాన్ని మన డాక్టరు 1945వ సం॥ జూన్ నెలలో ప్రచురించారు.

# చర్చిల్‌తో సంభాషణ

నిమ్నజాతుల న్యాయమైన హక్కులను ॥తం॥
కాలరాచేందుకు కాంగ్రెస్ ప్రయత్నించితె ,,
భారతదేశంలో అంతర్యుద్ధం ,,
తప్పదంటూ హెచ్చరించారా ,,
1946 నవంబరు 5వ తేదీన ,,
బ్రిటిష్ పార్లమెంటు భవనంలో ,,
కన్సర్వేటివ్ ఇండియన్‌కమిటీ ,,
ఈ జాతుల సమస్యలపై ,,
అనర్గళమైన వుపన్యాసం యిచ్చారా ,,

సభానంతరం మన డాక్టరు చర్చిల్‌తో ప్రత్యేకంగా వీరి సమస్యలపై చాలసేపు మాట్లాడినపుడు చర్చిల్ మన డాక్టరుతో అన్నమాటలు....

భారతదేశ పరిపాలనాధికారం బ్రిటిష్‌వారి చేతులలోనుండి కాంగ్రెస్ వారి చేతులలోనికి మారనున్న సమయాన భారత రాజ్యాంగ చట్టం నిర్మాణ దశలోవున్నపుడే మెలకువతో వ్యవహరించి మీకు కావలసించేమిటో నేర్పుగా చక్క బెట్టుకొనవలసిందిగా సలహాయిచ్చారు.

బొంబాయిలో పీపుల్స్ ఎడ్యుకేషన్ సొసైటీ [ప్రజావిద్యావర్ధక సంఘం] అనే పేరుతో మన డాక్టరు 1940 సెప్టెంబరు 13వ తేదీన ఒక విద్యాసంస్థను సిద్ధార్థ కాలేజీని స్థాపించి సొసైటీ చట్టాలక్రింద దానిని రిజిష్టర్ చేయించారు.

వీరిపై అగ్రవర్ణాలవారు అనాదిగా సాగిస్తున్న అత్యాచారాలను అరి కట్టాలంటే చాలామంది న్యాయవాదులు గావాలన్నారు.

వీలైనంత మంది ప్లీడర్లు కాగలిగితె ॥నం॥
కొంతమంది లీడర్లు వస్తారన్నారా ,,

"హు ఆర్ శూద్రాస్" అనే గ్రంధాన్ని వ్రాశారా ,,

అందు అన్ని విషయాలను వివరించారా ,,

హా. ఏమిట్రా చెప్పింది అసలుంచి కొసరుగా చెప్పరన్నా, బ్రాహ్మణులకు, వైశ్యులకు, క్షత్రియులకు శూద్రులు దాస్యం చేయాలి. అస్పృశ్యతను రాజ్యాంగ చట్టరీత్యా 1947 ఏప్రిల్ 29న నిర్మూలించాలని తీర్మానించారు.

ఇందుకు మన డాక్టరు ఎంతో సంతోషించారు. 1947 ఆగష్టు 15వ తేదీన దేశంకు స్వాతంత్ర్యం ప్రకటించారు.

## రాజ్యాంగ చట్ట రచనా - అధ్యక్షుడు

1947 ఆగష్టు 29వ తేదీన భారత రాజ్యాంగ చట్ట రచనా సంఘమునకు మన డాక్టరును అధ్యక్షునిగా ఎన్నుకున్నారు.

చట్ట రచనలో నిద్రాహారాలు మాని అహర్నిశలు శ్రమించి పని చేయుటవలన తన ఆరోగ్యం పూర్తిగా క్షీణించిపోయింది. తన ఆరోగ్యం గురించి తన సన్నిహితులు అడుగగా "మానవుని జీవితం తావికం! కాని రాజ్యాంగచట్టం శాశ్వతమైనది" అన్నారు. ఈ కారణాన తీవ్ర అస్వస్థతకు గురియైనారు. మోకాటి చిప్పల్లోను, ఎముకల్లోను బాధఎక్కువైంది. తక్షణ చికిత్స అవసరమై కొన్నాళ్ళపాటు ఆసుపత్రిలోనే వుండవలసి వచ్చింది. ప్రత్యేక వైద్యులతో పాటు శ్రద్ధ వహించేందుకుగాను, డా॥ సబితాకబీర్ అనే ఆమె నియోగింపబడింది.

ఆమె రాత్రింబగళ్ళు వీరిచెంతనెవుండి సమస్త సపర్యలు చేయుచుండెడిది. కాగా వీరు తిరిగి ఆరోగ్యం పొందారు. భార్యపోయి ఎన్నో ఏళ్ళు అయినా యింత కాలం తన ఆరోగ్యం తనే కాపాడుకుంటూ ప్రజా పోరాటాలను కొనసాగించారు.

కాని తానిపుడు అతి మూత్రం, కీళ్ళ నొప్పులు వంటి వ్యాధులతో శాశ్వత చికిత్స అవుసరమయింది. ఈ పరిస్థితులలో మరో వ్యక్తి తోడు

లేనిదే తన జీవితం కష్టమనిపించి డా॥ సవితా కబీర్ తనపట్ల చూపిన శ్రద్ధను చేసిన సపర్యలను గుర్తించారు. ఆమె అవివాహితన్న విషయం తెలిసికొన్న తరువాత అనుయాయులైన చిత్ర, జాదవ్ వంటి వారందరు ఆమెను వివాహం చేసికొనవలసిందిగా సలహా యిచ్చారు.

కాగా 1948 ఏప్రిల్ 15వ తేదీన డా॥ సవితా కబీర్‌ల వివాహం జరిగింది. ఈమె బ్రాహ్మణస్త్రీ.

1948 జనవరి నెలాఖరునాటికి రాజ్యాంగచట్ట రచన పూర్తిచేశారు. ఇందు 395 సూత్రాలతోను సర్వాంగ సుందరంగా ప్రపంచంలోని యితర రాజ్యాంగా చట్టాలన్నింటి కంటె మిన్నగా తయారు చేశారు.

19 వ సూత్రం అస్పృశ్యత నిషేధించింది ॥తం॥
అస్పృశ్యతా ఏరూపంలో పాటించినా ,,
అది నేరం అవుతుందా ,,
23 వ సూత్రం ప్రకారం ,,
నిర్బంధ దాస్యం నిర్మూలించారా ,,
16 వ సూత్రం ప్రకారం ,,
విద్యా, ఉద్యోగ రక్షణలు వచ్చాయా ,,
330, 332 సూత్రాల ప్రకారం ,,
కేంద్ర, రాష్ట్ర శాసన సభలకు ॥తం॥
జనాభా దామాషా ప్రకారం ,,
కొన్ని స్థానాలు కేటాయించ బడ్డాయి ,,
334 వ సూత్రం ప్రకారం ,,
అమలులోనికివచ్చిన 10 ఏళ్ళ వరకు ,,
ప్రాతినిధ్యపు కేటాయింపు కొనసాగుతుందా ,,
అవసరాన్నిబట్టి పొడిగించవచ్చునా ,,
335 వ సూత్రం ప్రకారం ,,

ఉద్యోగ రిజర్వేషన్లు వుండాలి ,,
338 వ సూత్రం ప్రకారం ॥తం॥
పరిస్థితులను వివేదికలద్వారా పంపాలి ,,
కాగా అన్ని పక్షములవారు అభినందించారా ,,
థామస్ జాఫర్‌సన్ అమెరికా చట్టాన్ని వ్రాశారా ,,
అంతకంటె మిన్నని ఆ పత్రికలు వ్రాశాయీ ,,

హా. అస్పృశ్యు లెవ్వరు ? [హూ ఆర్ అంటచ్ బిల్స్ ?] అంటె ఏమిరా తమ్ముడూ....

వ. ఆర్యులు మధ్య ఆసియా, ఐరోపా ప్రాంతాల నుండి మనదేశంలో అడుగుపెట్టక పూర్వం ద్రావిడులు యావద్భారత దేశానికి రాజులుగా వున్నారు. వారి అధికార భాష తమిళం. అంతకుముందు ఆదిమ జాతుల వారు వున్నారు. కావున ఆర్య, ద్రావిడ, ఆదిమ జాతుల సమ్మేళనంతో వైదిక [హిందూ] సమాజిక వ్యవస్థ ఏర్పడింది. అప్పుడున్నవి మూడు కులాలె. బ్రాహ్మణుల ఆధికారంను ధిక్కరించిన క్షత్రియులంతా శూద్రులు కావడంతో....4వ కులం ఏర్పడింది.

సంచార జాతులుగా వుంటూండిన ఆదిమ జాతులవారే కాక వైదిక సాంప్రదాయాల్ని వ్యతిరేకించిన అగ్రవర్ణాలు సైతం సంఘంనుండి వెలి వేయబడ్డాయి. వీళ్ళనువిడిపోయిన వర్గాలుగా మన డాక్టరు వర్ణించారు.

ఈ విడిపోయినవారు బౌద్ధమతాన్ని స్వీకరిస్తారు. వైదిక మతానికి బౌద్ధమతానికి జరిగిన గొప్ప సంఘర్షణలో బౌద్ధమతం బాగా దెబ్బతిన్నది.

గెలిచిన వాడు ఓడినవాణ్ణి బానిసగా చూచే ఆ రోజులలో ఎక్కువ వారుగా చూడబడుచున్న కులాలవారు అస్పృశ్యులుగా చూడబడ్డారు. ఇదే మన డాక్టరు వ్రాసిన "హూ ఆర్ అన్‌టచ్ బిల్స్?" అనే గ్రంథంలో పుట్టుపుర్వోత్తరాలు వ్రాయబడ్డాయి.

రాజ్యాంగంచట్టంపై వాదనలెన్నో జరిగాయా ॥తం॥
అన్నిటికీయన అవలీలగా జవాబిచ్చారా ॥తం॥
సభాధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాద్ సంతకంచేశారా ॥తం॥
1950 జనవరి 26 నుండి ఈ చట్టం అమలైయిందా ॥తం॥

హో:- హిందూ కోడ్ బిల్లు అంటే ఏమిట్రా తమ్ముడూ....

వ. హిందూ ధర్మశాస్త్ర బిల్లు సవరణ కార్యక్రమాన్ని ఈయన చేపట్టారు. ఇందుముఖ్యమైనవి స్త్రీ స్వాతంత్ర్యం, హిందూవివాహాలు, విడాకులు అనేవి ఉన్నవి.

1951 ఫిబ్రవరి 5న ఈ హిందూకోడ్ బిల్లు పార్లమెంటులో చర్చకు వచ్చింది. శ్రీమతి దుర్గాబాయ్ దేశ్ ముఖ్, హెచ్ వి. కామత్, కృపాలనీ యిత్యాదులంతా మన డాక్టరును గట్టిగా సమర్థించారు.

హిందూ చాందస్సులెందరో విమర్శించారా ॥తం॥
శ్రీ పటేల్, డా॥ రాజేంద్రప్రసాద్ వ్యతిరేకించారా ॥తం॥
ఈ విషయంన నెహ్రూ యిరుకున పడ్డారా ॥తం॥
ఎంతోమంది స్త్రీలు పార్లమెంటు భవనం ముందు ॥తం॥
నినాదాలిస్తూ గట్టిగా సమర్థించారా ॥తం॥
జస్టిస్ గజేంద్రగడ్కర్ అభినవమనువుగా వర్ణించారా ॥తం॥
చిట్టచివరకు ఈ బిల్లు వీగిపోయిందా ॥తం॥
అందుకు మన డాక్టరు రాజీనామా యిచ్చారా ॥తం॥

హో:- రాజీనామా యివ్వటానికికారణం ఏమిట్రా మామా-

1. ప్రధానమంత్రి నెహ్రూ మన డాక్టరుకు తగిన శాఖను యివ్వకుండుట.
2. నిమ్నజాతులవారికి జరుగుచున్న అన్యాయంపట్ల తానెంతో బాధపడుట.
3. విదేశాంగవిధానం రూపొందించడంలో పాలకవర్గంవారు అనుసరించిన ధోరణి తనకు అసంతృప్తి కలిగించుట.
4. ఆర్థిక, రక్షణ సంఘాలలో సభ్యత్వం లేకపోవుట.
5. హిందూకోడ్‌బిల్లు వ్యతిరేకించుట, ఇత్యాదులు కారణాలు.

# ది ఇండియన్ రిపబ్లికన్ పార్టీ - స్థాపన

బౌద్ధమతంగూర్చి ఈయన అభిప్రాయం ఎమిట్రా మిస్టర్.

రాజీనామా ఇచ్చిన తరువాత ఒక క్రొత్త పార్టీ నెలకొల్పారు. దాని పేరు "ది ఇండియన్ రిపబ్లికన్‌పార్టీ" అని నామకరణం చేశారు. దీనిని దేశమంతటా ఆయా శాఖలుగా ఆయా రాష్ట్రాలలో విస్తరింపజేశారు. మన రాష్ట్రంలో కూడ "ది ఆంధ్రప్రదేశ్ రిపబ్లికన్ పార్టీ" అనే పేరున ఒక పార్టీ పనిచేయుచున్నది. దీనికి శ్రీ బి. వి. రమణయ్య, శ్రీమతి జె. ఈశ్వరీబాయి, శ్రీ ఎస్. లక్ష్మీనారాయణ, శ్రీ శెట్టి కన్నమరాజా-పీడితజన ఎడిటర్, శ్రీ గోవాడ నిరంజనరావు - భాగ్యనర్ ఎడిటర్. యిత్యాదులు ముఖ్యులు.

హిందూమతంలోని కృష్ణుడు, క్రైస్తవ మతంలోని ఏసుక్రీస్తు మహమ్మదీయ మతంలో మహ్మదు పైగంబర్ వీరంతా తామే "మోక్షదాత" లైనట్లుగా ప్రకటించుకొన్నారు.

కాని గౌతమ బుద్ధుడు తాను "మార్గదాత"గా మాత్రమే తెలిపినారు. క్రైస్తవ, మహమ్మదీయ ప్రవక్తలంతా తమ ప్రబోధాలను మారుమాట లేకుండా పాటించితీరాలని శాసిస్తారు. కాని బుద్ధుడు తన ప్రబోధాలలో హేతువాదబద్ధంగా నిరూపితమైతేనే అనుసరించవలసిందిగా కోరుతారు.

ప్రపంచంలోని అన్ని మతాలలోను దేవుడు, దయ్యం, కర్మ, పునర్జన్మ, స్వర్గం, నరకం, వీటిని గురించే ఎక్కువగా వుంటుంది. కాని బౌద్ధమతంలో యివిలేవు. మానివుని పరిపూర్ణత్వానికి అవసరమైన నైతిక విధానం మాత్రం ఉంటుంది.

1952న సాధారణ ఎన్నికలు సిద్ధమైనాయి ॥తం॥
రూకబలం, మూకబలం, అధికారబలం ॥తం॥
కాంగ్రెస్ నాయకులుపయోగించారా ॥తం॥
రాజ్యసభకు ఈయన ఎన్నికయ్యారా ॥తం॥

1952 జూన్ 5న అమెరికాలో కొలంబియా యూనివర్శిటీ వారు ఈయనకు "డాక్టర్ ఆఫ్ లాస్" బిరుదు యిచ్చిరి. 1953 జనవరి 12న హైదరాబాదులో ఉస్మానియా యూనివర్శిటీవారు "డాక్టర్ ఆఫ్ లిటరేచర్" డిగ్రీతో గౌరవించారు.

# బౌద్ధమత స్వీకారం

మన డాక్టరు, శ్రీమతి డాక్టరు, కుమారుడు యశ్వంతరావ్, అన్న గారి కుమారుడు ముకుందరావ్ నాగపూర్ ప్రాంతాన నిమ్న జాతీయులు 5 లక్షల మంది ఒక్కుమ్మడిగా 1954 అక్టోబరు 14వ తేదీ విజయ దశమినాడు చంద్రమణి భిక్షువుగారి ఆధ్వర్యంలో బౌద్ధమతంను స్వీకరించిరి.

అనంతరం నాల్గవ ప్రపంచ బౌద్ధమత మహాసభ 1956 నవంబరు 15వ తేదీన ఖాట్మాండూలో ఏర్పాటు చేయబడింది. దానికి మన డాక్టరును ఆహ్వానించారు. ఆ ఆహ్వానాన్ని అందుకుని వారియొక్క కోరిక మేరకు 'బుద్ధిజం-కమ్యూనిజం' అన్న అంశంపై మాట్లాడమన్నారు.

కాగా యీ సబ్జెక్టు మన డాక్టరుకు చాల యిష్టం. బుద్ధుడు - కారల్ మార్క్సు ఈ రెండు సిద్ధాంతాలు ఎలాగు నిర్వహించబడినవో తెలిపారు. ధనికులు తమ ఆర్థికబలంతో పేదల్ని దోచుకుంటున్నారని కమ్యూనిస్టు సిద్ధాంతం చెప్పుచున్నది.

వ్యక్తిగతమైన ఆస్థి వుండరాదన్నది మొదటి అంశం. ఆస్థి యావత్తు ప్రభుత్వపరం కావాలని, ఆ ప్రభుత్వం కార్మిక నియంతృత్వంలో కొనసాగాలని మార్క్సు చెప్పారు.

బుద్ధుడు రెండువేల ఏండ్లక్రితం ప్రపంచం దుఃఖంతో కూడుకున్న దన్నారు. ఈ దుఃఖం ఎలా ఏర్పడుతున్నదన్న సత్యాన్ని ఆలోచించి నట్లయితే ఒకరు మరొకరిని బాధించుట చేతనే దుఃఖం ఏర్పడుతున్నదని బుద్ధుడు చెప్పారు. 60 - 2 - 00.

కారల్ మార్క్సు మౌలిక సూత్రమైన యీ 'దోపిడి'కి బుద్ధుడు ప్రవచనమైన యీ 'దుఃఖాని'నికి తేడా లేదన్నారు.

ఈ అంశంపై అనేక ఉదాహరణలిచ్చారు.

అనంతరం 1956 సం॥ డిశంబరు 6వ తేదీన తెల్లవారుఝామున 3 గంటలకు కన్నుమూశారు.

ఈ విషయం విన్న ఏడుకోట్లమంది నిమ్నజాతీయులు కంట తడి పెట్టారు. — మంగళం